# ధనుర్దాసుడు





**1958**



శ్రీమాన్ కవిరత్న కవిశేఖర

శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యులు

కార్యాలయము :

"శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘము"

సహాయ కార్యదర్శి

"భక్తి నివేదన" పత్రిక

సహాయ సంపాదకులు



శ్రీ వాసుదాసాశ్రమము

నడిగడ్డపాలెం — చుండూరు పోస్టు

తెనాలి తాలూకా : : గుంటూరు జిల్లా

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ స్థాపకులగు

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ
జీయరు స్వామివారు

ధనుర్దాస కావ్యమునకు – కటాక్షించిన

# మంగళాశాసనము

కవిరత్నమునకు – అనేక మంగళాశాసనములు

యతిరత్నమగు శ్రీ రామానుజాచార్యస్వామికి, దాసరత్నమగు ధనుర్దాసునిచరిత్రను, కవిరత్నమగురామానుజాచార్యులు, పద్య రత్నములతోఁ బ్రబంధీకరించుటయు, అది భాగ్యలక్ష్మీ కటాక్షముచేఁ బ్రచురింపఁబడుటయు సర్వాత్మనా ప్రశంసింపఁదగియున్నది.

(సం) శ్రీమన్నారాయణ రామానుజ జీయర్,

(మకాం) శ్రీకూర్మం. 12–11–58

ఓమ్

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రస్తావన



నాఽహం జానే కవనసరణిం నాఽస్మివా గ్రన్థకర్తా
పాణ్డిత్యం మాం నవరయతి నో వాగ్విదాం "శేఖర"త్వం।
తజ్జత్వాంశేఽ సతిబతకథం త్వావిధామిద్ధ "రత్నం"
"భాగ్యా" యత్తం మమనియమనం సద్విధేయస్య చైవమ్॥

పెద్దలమాట పెడచెవినిడరాదు. తగనను తగవు తగదు కద! ఓపినంతకు వ్రాయనుంకింతును.

## I

'ధనుర్దాసుఁడు' కృతికర్తలగు నాచార్యులవారు రసవద్రచయితలుగ "భక్తి నివేదన" పత్త్రికాముఖమున ముఖ్యముగ భాగవతలోకమునకు సుపరిచితులు. కవిగా "రత్న", "శేఖర" బిరుదాంచిత 'సుధీమణు'లు. వీరి "శబరి" ని గూర్చి నేనొకప్పుడు మెచ్చి ముచ్చటించినటుల గురుతు. ఖండకావ్యసృష్టిలో వీరికఖండమైన నేర్పేర్పడినది. ఇప్పటి కేముప్పదియో వెలయఁజేసియున్నారు. "ధనుర్దాస" గ్రంథము ప్రస్తుతము. ఈచిన్నిపొత్తమున ధనుర్దాసునిగాథ యొకనిమిత్తమాత్రముగ "నుడయవరు"ల లోకోత్తరోత్తమత్వమును విశిష్టాద్వైతసిద్ధాంతవిశ్వశ్రేయస్త్వమును విశదీకృతములు. శైలితీయందనము 'పంచదారలోనద్దిన ద్రాక్షకన్న రుచియన్న యథార్థము'. ప్రకరణోచితముగ శరణాగతి, పంచదీక్షలు, ఆచార్యారాధనము, భాగవత కైంకర్యములు జీవిత

భాగధేయములని యుగ్గడింపఁ బడినది. తత్త్వమంత్రోపదేశము కాంతాసమ్మితముగఁ గావించుటలోఁ గృతకృత్యులు "కవిశేఖరులు". గ్రంథారంభాత్పూర్వము కథావిధానపు విన్నపమైన పిమ్మట శ్రీభగవద్రామానుజ నవరత్నమాలార్చన జరపి జ్ఞానశాలులు, త్యాగశీలురు, కార్యశూరులునగు మూవురు పుణ్యమూర్తుల స్మృతి పురస్సరముగ ధర్మాత్మురాలగు "కవివర్యుల పాలిటి భాగ్యలక్ష్మి"కిఁ గృతజ్ఞతా నివేదనావసరమున నీతన "శారదా" కన్య నల్లారుముద్దుగఁ గోడలింజేసి యప్పగించి రాణించినది "కవిరత్నము".

ఇక్కాలన్యమెవ్వరి స్మృతిచిహ్నమో యామువ్వురయ శశ్శరీరులనిట నొకపరి భావించుటుచితము. శ్రీవేంకటనారసింహ నామధేయులు గ్రంథముద్రాపకురాలగు భాగ్యలక్ష్మమ్మగారికి మామగారు. మజ్జ్యేష్ఠపితృవ్యస్థానీయులు. "తాళ్లముదునూరు పాడ"గ్రహారము వీరిది. 'అయ్యవారలుగారు'. అత్యంతగంభీర మనస్కులు. పరిస్థితులకు లోఁగని ధీరచిత్తులు. విశిష్ట వివేక సంపన్నులు. 'శ్రీబాలవేంకటేశ్వరా' లయ స్వామ్యశోభితులు. నేఁడు 'పెంటపాడు' లో విరాజిలుచున్న యున్నత పాఠశాల వీరిచేస్థాపింపఁబడి వీరిపేర నే వ్యవహరింపఁబడుచున్నది. దానికొక శాశ్వతనిధినేర్పరచి చిరస్థాయిగ నాశీర్వదించిరి. నేఁటి యాచరణమున మత, విద్యావిధానములలోని యపశ్రుతుల కెంతయు వంతనొందిన బుధవరేణ్యులు.

తలిదండ్రుల కేకైక సంతానమును సుకుమారులునగు సుకుమారులు శ్రీవీరరాఘవస్వామిగారు. సుమనోమనోహరులు.

శ్రీభాగ్యలక్ష్మమ్మగారు వీరి ధర్మపత్ని. నేఁటికిని నిరవధిగ నెఱ వేయుచున్న "శ్రీవైష్ణవ పత్రిక"కు సంస్థాపకులు శ్రీస్వామిగారు. పత్త్రికావశ్యక 'ముద్రణాలయ' నిర్మాతలు. భగవద్భాగవత విషయ విశేష విజ్ఞులు. 'యతిరాజ' మతసేవాభిలాషులు. అందము, చందము, ముందంజ వీరియుఁలవాటులలోని వన్నెతీరులు. లలితశిల్పనైపుణి వీరిలోని మరియొకవిశేషము. మరియు వీరిస్మితవదనము, మృదుహృదయము, స్నిగ్ధభాషణము నిన్నింటికిఁ జెన్నుగూర్చినవి. తరుణవయసుననె పరమపదమలంకరించిరి.

ఇఁక మూఁడవమూర్తి శ్రీగోవిందరాజ లాంఛనులు. ఈయన శ్రీభాగ్యలక్ష్మమ్మగారి యనుజసోదరులును నాకుఁబెదతల్లి కొమరులును, అన్నింటను మిన్నులుగమించిన మిన్నయై యాయుర్వయోంశములయందు మాత్రమే నాకన్నఁజిన్న. ఈ మూర్తినిగూర్చిముచ్చటగ మూఁడుమాటలు: చిన్నచదువు మొదలు స్నాతక పట్టము (B. A , B. L.,)లందు దనుకఁ బరీక్షలలో రాష్ట్రమున ప్రథమస్థానమీయనస్వామ్యము. అనూనాద్వితీయప్రతిభ విద్యలందువలెనె వ్యవహారములందును నమేయ వైదుష్యము, మితభాషణము, నిత్యస్మేరాననము, నిరాడంబరము, నిస్సీమగుప్తదానములు తద్గుణపేటికలోని కొన్ని సొత్తులు. సోదరికిఁ జేయూతగనిల్చి పైనుడివిన యాలయము, పత్త్రిక, యచ్చునిలయము, పాఠశాల సంస్థలన్నింటిని సుస్థిర సక్రమ పరిశారమున నభివృద్ధిపరచుటకనువగు నమూల్యమార్గసూచనలు సేయుచు వాసిగాంచిన వదాన్యవ్యక్తి. చెన్నపట్టణమున నివసించి న్యాయవాదిగఁ బేరెన్నికగాంచి న్యాయాధిపత్యము వహించి మించిన

ధీశాలి. గుణఖని, కాని, యంతలోనె యమరలోకమధివసించిన యమరజీవి.

ఈ గ్రంథ ప్రచురణ కర్త్రియగు శ్రీ భాగ్యలక్ష్మమ్మ గారు మీఁదఁజెప్పిన సంస్థలను జక్కఁగఁ బెంపొందించుచు స్మృతి చిహ్న ప్రతిష్ఠామాత్రమె కాక పూర్వోక్తమూర్తిత్రయ సదాశయములను బ్రత్యక్షరము భగవత్సాహాయ్యమున నిర్వహించుచుఁ దదౌదార్యకల్పతరువును శాఖోపశాఖలుగను లోక హితార్థముగను వీలగునంతకును విస్తరించురీతి ననుసరించుచు స్వయముగ నెన్నియో గుప్తదానములు సేయుచు ధర్మకార్యముబందాసక్తిమెయిఁ బ్రత్యక్షముగను, బరోక్షముగను నాచరించియు నాచరించుచు నాచరింపఁబోవుచు నెంతయు ధన్యజీవియగుననుట సాధారణస్వభావోక్తియే. స్వకీయమగు నానాఁటి "పత్త్రిక"ను జెక్కుచెదరనీయక వర్ధిలఁజేయుచునే "భక్తినివేదన" నాదరించి "బదరి"లోఁ దన్నిర్వాహక సంఘ కృత మత విస్తరణ పురుషకారములన్నిట భక్తులను మీరిన భక్తురాలయి ధనరూప సహాయముతోఁద్రృప్తినొందక శ్రీమద్రామానుజ దివ్యోపదేశ ప్రాశస్త్య ప్రయోజనములను బ్రజలకందఁజేయు కార్యములకు జీవితము నంకితముసేసి "శుక్రవారవ్రత" మహిళాసదస్సులు నెలకొల్పి, బదరీనాథ భక్తురాలై, శ్రీమన్నారాయణ జియ్యరుస్వామ్యాశీః ప్రభావముతో భగవద్భాగవత సేవాపరాయణురాలగుట సామాన్యాంశముకాదు. చేతలకును జెప్పుటలకును నెంతదూరమో లోకమెఱుంగనిదికాదు. మూర్తిత్రయ కృతులు సూత్రము లగుచో నీమెయొనర్చిన తద్వికాసనవిధాన విస్తృతి భాష్య

సన్నిభము. ఈమెకు శ్రీవైష్ణవ లోకమెల్లపుడు కృతజ్ఞము. సోదరికీతమ్ముని వినయ విధేయతాభివందనములు.

ఆత్మీయ గుణగణన మాత్మస్తుతి తుల్యమందురు. కావున నింతతో విరమింతును.

కావ్యమందలి మెఱుగులారసి యానందించుటకుమున్నొక చిన్న విన్నపము. ఆస్తిక మతాంతరములందు లక్ష్యైక్యము గల్గియు విధాన వైవిధ్యమును సిద్ధిస్వరూప భావనవైచిత్రియుఁ గోచరింపవచ్చును. దీనఁబరత్వశంకకుఁ దావులేదు. దరిఁజేరుటకే యందరిదారితీరులును. ఏసత్రిక్కను సౌమనస్య సామరస్యములె చక్కని రాజమార్గములు. అందును శ్రీవైష్ణవ సంప్రదాయమున, 'యతిరాజ' చరితమిందులకు దార్హాణము. "ఉడయవరు"ల నుడిసారము సాత్త్వికతకద! అగుచో మతాంతర సోదర విషయమున మేలగు "జాలి" నిలిపి మెలకువమెయి నుడికారముల గారము తలఁగిన నెంతయు నన్నెగూర్పదె? "భుజంగభంజన", "దుర్మదపండదావదహనే" త్యాది ప్రయోగములు ప్రాచీనములని పర్యాయపఱచుటపరిపాటి. అయిననువానియందు 'స్పర్ధా'ది శబ్దములందువలెనె కాలవశమయి నేఁటివ్యవహారమున నెలకొనిన విపరీత భావస్ఫురణమూనాఁడుండినట్లూహింపజాలము. ప్రసన్నలవదనకమలముల నుండి పరుషభాషణములను భావింపఁ బసందగునాయని దాసుని సందియము. ఇట భాగవతాపచారము దాసుని యుద్దేశ్యముకాదు. వీలగునంతవరకు నేరికిని మనఃక్లేశ మొదవని మృదుసూక్తుల నుపయోగించునుపచారము మాత్రమే కటాక్షింపఁ బ్రార్థన.

కావ్యగానమునకుఁ బూర్వరంగముగ రచింపబడిన (1) "......కథావిధానము" న శ్రీభగవద్రామానుజ చరితమహత్త్వమును, ధనుర్దాస జీవితపరివర్తనమును వక్కాణింపబడినవి, (2)"......నవరత్నమాల" లో శ్రీమద్రామానుజుల నుద్దేశించి మంగళాశాసనముకలదు, (3)"......కృతజ్ఞతానివేదనము" నందు గ్రంథముద్రాపకురాలగు శ్రీభాగ్యలక్ష్మమ్మగారి సద్వంశ, సచ్ఛీల, సత్కార్యాది సంస్తుతి సంతరింపఁబడినది. కావ్యభాగము 210 పద్యములకుఁ బరిమితమై నాల్గుసర్గలుగ విభజింపఁబడినది. తొలిసర్గకుముందు "హయముఖస్వామి" ధ్యానశ్లోకమును, దక్కిన సర్గలముందఱఁ దత్తద్విషయ స్ఫోరకమగు నొక్కొక్కపద్యమును బ్రత్యేకముగ నీయఁబడినవి. ప్రథమసర్గలో శ్రీమద్రామానుజుల శ్రీరంగప్రవేశము 41 పద్యములలో సంకీర్తితము. రెండవది (54 పద్యములు) ధనుర్దాసుని భార్యాసౌందర్య వ్యామోహసంభృతము. తృతీయసర్గలో ధనుర్దాసుని "యతిరాజ" సన్నిధిసంప్రాపణము 77 పద్యములలో వర్ణితము. నాలవది (35 పద్యములు) హేమాసమేత చాపదాసచక్రాంకన చకాసితము.

II

ఒక సామాన్య జీవితోదంతము నితివృత్తముగావించి కావ్యాగ్రహత కల్పించుట యందువిషయములందును రససాంద్రత నవలోకించు కవిగారి చాతురికి నిదర్శనము. ధారగా వెలువడిన పద్య పద్యమందును సారవంతమగుహృద్యత సంపాదింపఁబడినది. ఉదాహరణముగ నాయకుని ప్రణయముగ్ధత (స. 2) విషయ

విరక్తబోధ (స. 3) ఘట్టములు గైకొనవచ్చును. హేమ చాప దాస కపట కలహా శృంగారమును (స. 2) నాలవజాతివాని కేలూనిన యోగిచంద్రుని జూచిన భక్తజనానుభూతమగు మానసికాందోళనమును (స. 3) చక్కఁగఁ జిత్రింపఁబడినవి. "ప్రేయసి-కాదు-దాసురాల" నెడు మార్పుపొడమియు "మనసు సతి చెంత నేను లక్ష్మణునిజెంత" నైన "భావానుభూతి సంగతుల నలిగి," "మీమహాత్ముఁడీ మోసముచేసినాఁడ" ని బాధనెంది, తుద 'కటు నిటు' తన 'ప్రేయసి నేత్రమ్ములు' ను "స్వామికనులు" ను జూచి "కటకటబడి", "యశుభ్రపులురాల" మునికి మ్రొక్కిన నాయకుని యవస్థాపరిణామ పోషణములోఁ గవిగారు మానవమనఃప్రవృత్తి నింపుగ బింబింపఁజేసిరి. భావమునుహృదయమున నత్తుకొనఁజేయు కొండొక 'తెనుఁగుదనముఁ' జూపు ప్రయోగములు దండిగఁగన్పట్టును. "అమాంతముగ" (ప 16) 'చూచినదిజాడయె' (ప. 78) "ఏదీలేని" (ప. 95) 'లేనెలేద' (ప. 108) 'ఈతోలుమొగాలకా!' [ప. 115] "అమ్మ లభించె ......" [ప. 131] "కాఁగలదోయి నాయనా" [ప. 166] "మా దేవుని నేత్రవైభవము దివ్యమురా! యొకసారిజూడరా!" [ప. 205] మున్నగునవి గమనింపఁదగినవి. అమూల్యవేదాంత విషయమును మామూలు మాటలలోఁ దెల్పునేర్పునకుదాహరణము: 'నాయన! సర్వము వాఁడొసంగెరా!' (ప. 198) "ఆయన వస్తువాయనకు నర్పణసేసి" [ప. 199] ఈ భావమే "చేతిమీఁద నీపండును నీకొసంగి" యని 'శబరి' కావ్యములోఁగూడ వచించిరి. (ప. 73) శ్రీవైష్ణవమతవైశిష్ట్యము (ప. 183–190)

పంచసంస్కార ప్రయోజనము [ప. 34] తిరుమంత్రము ప్రభావము [ప. 35, 36] నారాయణ పరత్వము (ప. 199) విపులముగ విశదీకరింపఁ బడినవి. భక్తుని యుత్తమత్వము ప. 118–119 లలో నుట్టంకింపబడినది. "మద్భక్తః శ్వపచః ప్రియః" యని కదా 'భాగవత' వాక్కు. కావ్యమున నాద్యంత "మాచార్య" శబ్దమూ 'యతిరాజు' నందే యన్వర్థమును సత్యమును స్థాపించిమించిరి. 'యతిరాజు' యతిశేఖరత్వము [ప. 194–5] మతసామరస్యమును [ప. 7] విశాల దృక్పథమును (ప. 112) "ఎంబెరుమానారు" ల లోకకల్యాణార్థమైన త్యాగశీలము (నవరత్నమాల ప. 6) [గ్రంథ ప 8, 103, 109, 111, 196] 'ఉడయవరు' ల హరిజనోద్ధరణము [ప. 9, 10] ఆర్తజనులెడ 'నాచార్యు' ని యార్ద్రహృదయత [ప. 106, 130, 151] చవిగొనదగు.

విషయవిస్తరభీతిచే నింకఁగొలఁదిగనె ముచ్చటించిముగింతును. కవిగారి రమ్యభావనలకు ప. 22 32, 42, 52, 57, 85 లును, గామినీకాంచన గౌరవౌచిత్యమును [ప. 190] మెచ్చుతునకలు. సంయమీంద్రుని ప్రజాకర్షమునకు "ఆ. వె." (ప. 17) నుపయోగించినారు కవిగారుచమత్కారముగ, ప. 102 వ సంస్కృతాంధ్ర సమ్మేళనము చక్కగనున్నది. ప. 27, 38 లందలి శబ్దచమత్కృతియు బాగుగనున్నది. 'ఇంతి ముఖంపుఁ బ్రతికి......' [ప. 128] అను రచన మనుచరిత్రలోని "కలంచునేసతుల మాయల్" అను దానికి సన్నిహితమై జ్ఞప్తికిఁదెచ్చును. ప. 4, 79, 94 లందలి కమ్మని 'ఉపమ' లు ప. 104 లోని కమనీయ 'కావ్యలింగము' ప. 204 న నసమ 'విషమ'

ము నందముగ నున్నవి. పలుతావులఁ గన్నులకుఁ గట్టినట్లు దృశ్యములు గూర్పఁబడినవి. నన్నయమాదిరి నాతిక్లిష్టసుదీర్ఘ సంస్కృత సమాసరచనకు ప. 33, 37, 44, 54, 75, 20 లు దాహరణములు. తిక్కన తీరున 'నేవా' ర్థకముగ 'అ' త్వ ప్రయోగము 137, 140, 162 లు మొదలగు కొన్నింటఁ గానవచ్చును. శైలీసరళత కేపద్యమును బ్రత్యేకించుటకో తెలి యదు. అన్నియు మిన్నలె. ప. 92 న Verbal Irony [రా బోవునది తెలియకయె ముందుగ నోటఁబల్కుట] కలదు. యతి శేఖరుఁడు చాపదాసునిగూర్చి పల్కినపద్యము [150] నుద్దేశము తెలియరాకున్నది. 'ధీమతాం ప్రమాద' ము లెట్టిరచనలందు నేఱవచ్చును. అట్టి యతనముతోనిటఁ బనిలేదు. పెంకెల పెడ ర్థముల కెడమీయకుండునటులఁ "గృతజ్ఞత" లోని ప. 5, 11 లును గ్రంథమండలి ప. 2, 21 లును గూర్చియుండిన లెస్సగ నుండెడిది. ధ్యాన శ్లోకమున "జన్తుః" అనుచోట 'దాసః' అ న్నచో సమత మోతాదుగ నుండుననుకొందును. ముద్రరపొర పాటులు దిద్దుటవసరము.

చెదురగు నుడివిత మలరిచి
యెదఁగొను "యతిరాజు" నాన నెఱిగించిన శ్రీ
"గుదిమెళ్ళ" "కవిశేఖరు" లకుఁ
బదిలపఱుతు నిచట మెప్పుపల్కులవెన్నేన్॥

"రామానుజార్యదివ్యాజ్ఞావర్ధతా మభివర్ధతామ్"

1–8–1958 } భాగవతవిధేయుడు,
విజయనగరం. } తిరుమల నరసింహాచార్యుఁడు,

శ్రీ హయవదన స్సహాయః

# ధనుర్దాస - కథావిధానము

శ్రీ భగవద్రామానుజులు మతత్రయప్రవక్తలగు మహానీయులలో నొకరు. శ్రీ విశిష్టాద్వైతసిద్ధాంతమందు బద్ధాంతఃకరణులు. వీరు శిఖాయజ్ఞోపవీత కాషాయ త్రిదండములు స్వీకరించిన శ్రీ వైష్ణవ సన్న్యాసులు -

వీరు మత ప్రచారార్థమయి, ఆసేతుశీతాచలముదాక పర్యటించిరి. ఆ పర్యటనలో బహిర్గతమైనదే యీ యితి వృత్తము -

శ్రీ భగవద్రామానుజుల వారి నిర్హేతుకజాయమాన కటాక్షపాత్రులగు శిష్యులలో "ధనుర్దాసు"కఁడు. ఇతఁడు కులమునకుఁ జతుర్థుఁడు. మహాభోగి, తృతీయ పురుషార్థమును, దృష్టిదీర ననుభవించుటకు దేహారోగ్యము, దివ్యసౌధము, తియ్యని ప్రాయము, దివ్యసౌందర్యవతియగు హేమాదేవియను భార్యయు కలిగియుండెను. అప్రతిమానమగు నామె సౌందర్యమునకంతయు వన్నె తెచ్చినవి కన్నులు -

ఒకనాడు ప్రాతఃకాలమున ధనుర్దాసుఁ భార్యనేత్రములు బాలాతపమునకు వాడకుండ బజారులోఁ బస్సుగొడుగుఁబట్టి

కావేరి కేగుచుండగా నాకస్మికముగా శ్రీ రామానుజులవారి కటాక్షము వారిపై సోకెను -

దానితో ధనుర్దాసుని జీవితమొకదారి పట్టినది -

రానురాను శ్రీ రామానుజులవారి చరిత్రలో ధనుర్దాసున కగ్రస్థానము లభించెను. స్వామి - స్నానమాడక ముందు స్వాముల చెయ్యిని, స్నానమాడిన పిమ్మట ధనుర్దాసు చెయ్యిని పట్టుకొనెడువారట -

ఇట్టి చిత్రములు శ్రీవారి చరిత్రలో నెన్నియోయున్నవి. వారి విశేష ధర్మానుష్ఠానములు ప్రాకృతులకందరానివి -

తిరుమంత్ర ప్రదానము - తిరునారాయణపుర దేవాలయ సమస్య - దీనజనావన దీక్షావిశేషము - మతప్రచారము ఆశ్రమ స్వీకారము - పంచములయందు పరమౌదార్యము - దేశికాంగుళిత్రయ మోచనము - కాంచీపూర్ణులపైఁగల గాఢానురక్తి - కార్పాస లక్ష్మికిఁగలిగించిన కామపరివర్తన - యాదవప్రకాశ దుర్వాదనిర్వాపణము - తిరుమల శ్రీనివాస స్థిరీకరణము శ్రీకూర్మనాథ విజయము - శ్రీభాష్యరచన -

ఇత్యాది విశేషములు శ్రీవారి చరిత్రలో నితమిత్థములని నిరూపింపరాని మహిమలుకలవు -

శ్లో॥ సర్వదేశ - దశా - కాలేష్వ - వ్యాహత పరాక్రమా
రామానుజార్య దివ్యాజ్ఞా - వర్ధతా మభివర్ధతాం ॥

శ్రీ హయగ్రీవాయనమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భగవద్రామానుజ - నవరత్నమాల



1

జయ పాషండమహీజ దావదహనా ! చార్వాక శైలాశనీ !
జయ బౌద్ధాంధ్యనిరాస వాసరమణీ ! జైనేభ కంఠీరవా !
జయ మాయామతవాది భోగిగరుడా ! శ్రౌతాంత చూడామణీ!
జయ శ్రీరంగజయధ్వజా ! మునిబిడౌజా ! స్వామి రామానుజా!

2

పాషండద్రుమషండదావదహన ప్రఖ్యాతి నార్జించి శ్రీ
యోషానాయక రంగరాజ పదపద్మోపాంత దాసుండవై
కాషాయాంబరధారివై, త్రిజగతీకళ్యాణ సంధాయివై
శేషాంశాస్తి జగద్గురుండవగునిన్ సేవింతు రామానుజా !

3

శ్రీవైకుంఠమునందు శౌరి కరుణాసింధుండు కానన్ గలిన్
జీవుల్ దుఃఖముఁజెందు చుండగని లోఁజింతించి తచ్ఛాంతికై
నీవానాడు త్రిపాద్విభూతిపదవీ నిశ్శ్రేణికామార్గమున్
దేవా ! చూపితివంట నీమహిమనెంతేనెంతు రామానుజా !

4

అవతారంబునుదాల్చి భూతపురిలో నాసూరి వారింటఁగే
శవసూనుండనఁ దంజమాంబసతితో సంసారమందుండి యా
దవు "గప్యాస" పదార్థమందలి వివాదంబందు నిర్జించి కాం
చవె ! శ్రీయామునకుంచితాంగుళి రహస్యార్థంబు రామానుజా!

5

వరదాజ్ఞన్ మధురాంతకంబున మహాప్రాజ్ఞుండు పూర్ణార్యుఁడా
దరమేపారఁగఁ దప్తముద్రఁ దిరుమంత్రంబీయ, ధన్యుండవై
గురుతాపీఠిక నెక్కి దాశరథినిన్ గూరేశునిన్ యాదవున్
గరుణన్ శిష్యులుగాగ నేలితి నమస్కారంబు, రామానుజా !

6

శ్రీరంగాలయ పాలనంబుఁగొని గోష్ఠీపూర్ణు మంత్రార్థముల్
ధారాళంబుగ లోకులందఱు వినన్ ద్యాగంబుగావించి దు
ర్వారప్రజ్ఞుఁడు యజ్ఞమూర్తి యెదురై వాదింప నోడించి పెం
పారన్ వానికొసంగినావుగద చక్రాంకంబు రామానుజా !

7

శ్రీశేషాచలమేగి రామచరిత శ్రీమద్రహస్యార్థముల్
శ్రీశైలేశ కృపాకటాక్ష కలనన్ సేవించి "శ్రీభాష్యమున్"
దేశఖ్యాతిగఁ దెల్పి "సంగ్రహమనన్" "దీపంబు"నా "సారమున్"
ధీశక్తిన్ రచియించినాఁడవు శ్రుతుల్ దీపింప రామానుజా !

8

అద్వైతద్వైతమతంబు సేయుఁగ విశిష్టాద్వైతసిద్ధాంతమున్
స్థాపింపన్ బహుదేశముల్ గని ఘనుర్ధానున్ గటాక్షించి ప
ద్మాస్త్రీపతి మూర్తికాంతికళాలీలాత్మ సంపత్పరున్
మాపుత్రాయుని శిల్పినట్టి నిను సన్మానింతు రామానుజా !

9

మీ కాషాయము మీ త్రిదండమును మీ
స్మేరాంకురాస్యంబు మీ
శ్రీకాంతాంఘ్రి సరోజదాస్యమును మీ
శ్రీభాష్య వైదుష్యమున్
మీ కళ్యాణగుణప్రభావమును స్వామీ !
లక్ష్మణాచార్య ! యిం
డా కల్పాంతము సత్యమంగళము నిత్యశ్రీగ
వర్ధిల్లుతన్

ఓం తత్సత్

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మ అమ్మవార్లంగారికి
# కృతజ్ఞతానివేదనము



1

సిరిగల శ్రీనివాసపురసీమ వసించెడు బాలవేంకటే
శ్వరుఁడు కృపాప్రసన్నుఁడయి సాకనుగాత నితోఽధికంబుగా
తిరుమల వీరరాఘవ సుధీమణికిన్ కులధర్మపత్నియై
స్థిరయశమందుకొన్న విదుషీమణి, శ్రీమతి, భాగ్యలక్ష్మినిన్

2

పుట్టెన్ శ్రీగల "వింజమూరి" సుకులాంభోధిన్ సుతాఖ్యాతితో
మెట్టెన్ "తిర్మల"వారి వంశము స్నుషామేయప్రభావంబుతో ।
పెట్టెన్ పత్రిక, పాఠశాల, గుడియున్, విద్యాసభల్, సత్రమున్
గట్టించెన్ మన, భాగ్యలక్ష్మియని నేఁ గార్తజ్ఞ్యమర్పించెదన్

3

శారద నిత్యమున్ చరణసారస యుగ్మసువర్ణ నూపురో
దార ఝుళంఝుళధ్వనులు తారసిలన్ దిరుగాడుచుండగా
వారిధిపుత్రి పేర్మి బహుభాగ్యములన్ గురిపించుచుండగా
జేరితి భాగ్యలక్ష్మివయి శ్రీమతి ! తిర్మలవారియింటికిన్

4

పతి - శ్రీతిర్మల వీరరాఘవ మహాప్రాజ్ఞుండు, మీమామ స
న్నుతుఁడౌ వేంకటనారసింహ విబుధుండున్, భ్రాత-గోవిందరా
జతిలోకోన్నత కీర్తి సంపదలతో హైకోర్టుకున్ జడ్జి యీ
స్థితి నీకబ్బుటఁగన్నుకుట్టె విధికిస్సీ ! యేమి వాక్రుచ్చెదన్

5

భర్త గతించినాడు సడిప్రాయమునందున - మామగారు - త
ద్వార్త భరింపజాలక దివంగతులైరి, సహోదరుండు స
త్కీర్తిని మాత్రమిందునిచి దివ్యపథంబునుబట్టె - ధీరతా
మూర్తివి భాగ్యలక్ష్మి ! యిదెపో స్థిత లక్షణమెంచిచూడఁగన్

6

పతియున్ మామయుసోదరుండుముగురున్ ప్రాజ్ఞుల్ మహోద్యోగసం
స్థితులై నేడు యశశ్శరీరులగుటన్ శ్రీభాగ్యలక్ష్మమ్మ ! త
త్స్మృతి చిహ్నంబుగ నాప్రబంధమును ముద్రీభూతగాఁజేసి ని
ల్పితి వవ్వారి పవిత్ర జీవితకథాలీలా విశేషంబులన్

7

నీవిమలాత్మ - నిత్యరమణీయము - వైష్ణవపత్రికాది నా
నావిధ ధర్మకార్య కలనావిధి నిర్వహణంబునందు నీ
జీవిత మంకితంగుట సిబద్ధము - లక్ష్మివినీవు కావునన్
కోవిదులెన్న నాకృతిని గోడలు శారదగా గ్రహింపుమా

8

అనయంబుఁ బ్రజలాశ్రయింతురు విశిష్టాద్వైత సిద్ధాంత పో
షణకో - శ్రీయతిరాజదాస్య మహిళాసంఘ క్రియాసిద్ధికో
ఘన విద్యాలయసంస్థకో, బదరి కైంకర్యార్థమో నిన్ను, లే
దన కర్పింతువు భాగ్యలక్ష్మివను పేరన్వర్థ మీక్షింపఁగన్

9

పండితగోష్ఠులన్న గవివర్యకృతుల్ గ్రహియించుటన్న స్త్రీ
మండల శుక్రవాసర రమాశుభపూజల సంస్థకండగా
నుండుటయన్న నేమడుగనున్నను లేదనకుండుటన్న నీ
పండిన నోము పంటలవి బాపురె! యెంతటి భాగ్యలక్ష్మివో

10

దేవతవాణిలోఁగలుగు తీపినెఱుంగుదు, వాంధ్రభాషలో
సేవలొనర్చినావిఁకను జెప్పగనేటికి, ద్రావిడోక్తి నీ
కైవసమయ్యెఁ, బైన నధికారులబాసయు లొంగెనీకు, నీ
జీవిత మొక్క వాఙ్మయము శ్రీమతి యెంతమహాత్మురాలవో!

11

శ్రీగల పెంటపాడు పురసీమను పత్రిక పాఠశాలయున్
సాగుచునుండ, సన్నిధియు సత్రము శ్రీముదునూరుపాడులో
బాగనిపించుచుండ, కవివర్యులపాలిటి భాగ్యలక్ష్మివై
త్యాగినివై దరిద్రులకుఁదల్లి! నిరంతరమిట్లె యుండుమా!

12

యతిరాజాశ్రమమేదో నీవొకటియమ్మా స్త్రీల కధ్యాత్మ జీ
విత మేపొందఁగ దానమిత్తువని నే విన్నాను సంతోష మిా
కృతిరూపంబున నీపవిత్ర చరితంబెల్లఁ బ్రపంచైక వి
స్తృతమౌగావుత నీమహోపకృతికే నిత్తుఁ గృతజ్ఞాంజలిఁ



శ్లో॥ శ్రీమాన్ హయముఖస్వామినా
వర్ధతా మభివర్ధతాం
యత్ప్రసాదా దయంజన్తుః
కవి రిత్యభిధీయతే ॥

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రథమ సర్గ

1 తే॥ గీ॥

యత్కృతంబగు శ్రీభాష్య మాలకించి
భారతి యొసంగె శ్రీభాష్యకారబిరుదు
నిత్య, లీలా, విభూతుల నీడ యెవ్వఁ
డట్టి రామానుజాచార్య మహామహుండు

2 సీ॥

ఎలప్రాయమందునఁ గులసతిఁ విడనాడి
కాషాయ చేలదీక్షను వహించి
కొమ్ము లేనుఁగువంటి గురువుతో ఢీకొని
తిరుమంత్రరత్న మందఱకుఁజూపి
కడజాతివాడైన గడతేరు నట్లుగా
నంగీకరించి విఖ్యాతిఁగాంచి
గోవును గొఱ్ఱెగాఁగోయు మ్లేచ్ఛుఁడుకూడ
వియ్యమందఁగ జాలు నెయ్యమంది
తత్వజిజ్ఞాస మతములు తడవిచూచి
శ్రుతులు శోధించి యుపనిషత్సూక్తి వెదకి
బ్రహ్మసూత్రార్థ బహువిమర్శనము కతనఁ
దాను గనుఁగొనెఁ దుదకుఁ దత్త్వత్రయమ్ము

3 చం॥

వరమ విలక్షణంబయిన స్వామి కటాక్షము వీనినుండి యీ
కరణి బహిర్గమించె ననఁగాఁ బ్రవహించెఁ బునః పునర్జను
ర్మరణ దురీషణామయ దురంతదవానల దహ్యమానమా
నరసముదాయమందు "శరణాగతి" సూక్తిసుధాప్రవాహముల్

4 ఉ॥

అమ్మహనీయుఁడంత నిగమాంతలతాశ్రయదండమౌ త్రిదం
డమ్ము ధరించి ప్రేముడి నిడాతలమెల్లఁ జరింపసాగెఁ బూ
ర్వమ్మసురావనార్థమయి వామనరూపముదాల్చి బ్రహ్మతే
జమ్మున దానవేంద్రుమఖశాలకు సాగిన శౌరికైవడిన్

5 తే॥గీ॥

ప్రబల పాషండ, చార్వాక, బౌద్ధ, జైన,
భాస్కర, కుదృష్టి, యాదవ, ప్రభృతి వాది
కలిత వాదోపవాద సంగ్రామమందు
వేయి మొగముల వాదించి విజయమందె

6 ఉ॥

పేటకుఁ బ్రహ్మరాక్షసిరిగి భీకరనాస్తికతా నిదాఘదు
ర్ఘాటికి శుష్కమైన జనతాహృదయస్థలి భక్తిబీజముల్
నాటుచు నూటలూరు కరుణామయదృష్టి సుధాఝరంబుచేఁ
దోఁటలుపెంచు నాయతివిధుండతఁడెంత మహానుభావుఁడో

7 ఉ॥

వాఁడొక బ్రాహ్మణుం డితఁడు బాహుభవుం డతఁడొక్క వైశ్యుఁ డ
వ్వాఁడొక శూద్రుఁ డీతఁడొక పంచముఁడన్న విభేదదృష్టితోఁ
జూడక యెల్లవారు నతిసూక్ష్మముగాఁ దరియింప నొక్కఁడీ
జాడను జూపుగాని తెరచాటునదాచడు సంప్రదాయముల్

8 ఉ॥

ఆకరమందు గుప్తముగ నందముఁజిందుచునున్న, రత్నముల్
స్వీకృతిసేసినట్లు మును విజ్ఞు లనర్హులకందకుండగా
సాకిన మంత్రరాజమును సాధనఁజేసి తదర్థసార మీ
లోకు లెఱుంగఁదెల్పె గురులోకము తన్ను శపింపఁబూనినన్

9 ఉ॥

అన్నడికేమిగాని జగమంత తపించెడు సాహసంబు వే
రున్నది మేలుకోటగుడిఁజొద్దకుఁ బంచమజాతినెల్లఁ బో
మ్మన్న సమస్యమాత్రము మహాద్భుతమాతని సర్వమానవో
త్పన్నదయానుభూతికి నిదర్శన మెంత విశాలదృష్టియో !!

10 ఉ॥

శిష్యసుభద్రమంబనఁగఁ జెన్నువహింపఁగఁ జాలునట్టి శ్రీ
భాష్యము వ్రాయుగాక యతిపర్యనికయ్యది గొప్పగాదు, వై
దుష్యము లేకపోవుటనుఁ ద్రోవనెఱుంగక మూలనున్న యీ
దూష్యకులానికిచ్చెఁ గృపతోఁ దిరుమంత్ర మదేమిప్రీతియో !

11 ఉ॥

వాదముచేతఁగొందఱను వశ్యులఁజేసి, మహోపదేశ సం
మోదముతోడఁ గొందఱను ముగ్ధులఁజేసి, సుధాభసత్కృపా
పాదిత దృష్టిఁగొందఱను భవ్యులఁజేసి, భవాబ్ధిమగ్న ని
ర్వేద విమోచనార్థమయి భిక్షుకుసాగెఁ ద్రిదండధారియై

12 తే॥గీ॥

కన్న సంతానమునకు నిక్కట్లు వాపి
సకల వేళలఁగాపాడు జనకుఁడట్లు
ప్రజకు సంసారజన్యదూరుజ నడంచి
యపునరావృత్తిగతిఁజూపు యతివరుండు

13 ఉ॥

భూతలమందు నెందు పదముల్ కదలించునొ యద్ది క్షేత్రమై
ఖ్యాతివహించె, నిం దెవనిగాంచెనొ వాడొకధన్యజీవి ని
ర్హేతుక జాయమానకృపయే యొకచక్కని సాధనంబుగాఁ
జేతన కోటిరక్షణముసేయఁ జరింపఁగసాగె నంతటన్

14 తే॥గీ॥

రెక్కలూడిన పక్షులరీతినుండు
బద్ధచేతనకోటిని బరమ కరుణ
నుద్ధరింపఁగ నూహించి యొక్కనాడు
రాకవలెవచ్చె స్వామి శ్రీరంగమునకు

15 సీ॥

ప్రణవాకృతి విమాన వైభవంబతి దూర
మందె సేవించి "దాసోఽహ"మ్మంచి
అలనాడు శ్రీయామునార్యుని దుదియాత్ర
గనిన కావేరి సైకతము దాటి
సిరులొల్కు స్వాముల "తిరుమాళిగలు" గుల్కు
ప్రాకారసప్తకమ్మధిగమించి
"అడియే" ననుచుఁగొంద అంజలిబద్ధులై
సిర్ని మేషస్థితి నిలిచిచూడ

మోమునందున్న తెల్లని పుండ్రకాంతి
జ్ఞాన వైశద్యమును బహిర్గతము సేయఁ
బురికి నేతెంచి తిరువీధి నడుగుచుండ
నందఱెఱిఁగిరి రామానుజార్యుఁడనుచు

16 ఉ॥

పున్నమరాకచే జలధి పొంగిన వైఖరిగాఁ దదాగమా
భ్యున్నతి కెల్లవారలు నమోనమయంచుఁ దదీయపాదుకా
సన్నిధిలో నమాంతముగ సాగి నమస్కృతి సేయసాగి రా
కన్నుల కీయతింద్రుఁడొక కల్పకమై కనిపించెఁ నెంతయున్

17 ఆ॥ వె॥

లక్ష్మణార్యులనుచు రామానుజుండని
భాష్యకారు లుడయవరులటంచు
సంయమీంద్రుఁడనుచు జగదేకగురువంచు
గములుగట్టి ప్రజలు గ్రమ్ముకొనిరి

18 ఉ॥

ఆ తిరువీధియందు నడయాడుచునుండె యతీశ్వరుండహో
చూతము రండురండనుచుఁ జోద్యముగాఁ బురవాసులందఱున్
బ్రీతిగఁజుట్టుముట్టి రరవిందసువాసన రేగ షట్పద
వ్రాతము మూగునట్లు నలువంకల నెంత విశేషమున్నదో !

19 తే॥ గీ॥

ఇసుకచల్లిన రాలనట్లిరికినారు
ప్రజలు కనుచూపుమేర, నావంతగూడ
సందు కనరామి యతికుల చక్రవర్తి
చేయునదిలేక యచట వేంచేసియుండె

20 ఉ॥

వచ్చుట కన్గొలుంటగని వాకిట మూలలనిల్చి లోచన
ప్రోచ్చలదీక్షణ ప్రభలె పూవులదండలటన్న కానుకన్
నిచ్చి పురాంగనాతతి యతీంద్రుని దివ్యకథానుభూతులన్
మెచ్చుచుఁ బల్కసాగె శ్రుతిమేళనసేసిన వీణవైఖరిన్

21 సీ॥

ఇతఁడటే ! "ఆసూరి" గృహనామమేపారఁ
గాంతిమతీసతి కన్నబిడ్డ
అతఁడటే ! శ్రీయామునాంగుళిత్రయ ముద్ర
నూడదీయించిన యుత్తముండు
తఁడదే ! గోపురంబెక్కి మంత్రార్థంబు
వెదజల్లినట్టి సౌహార్దమయుండు
అతఁడటే ! తన పదామృతమిచ్చి బ్రహ్మరా
క్షసబాధఁ బాపిన సత్త్వమూర్తి

నిన్న మన నేలుకోటసన్నిధికి వచ్చి
దర్శనంబిచ్చినట్టి యుదారుఁడటవె !
ఎన్నినాళ్లకు మనకబ్బె నితనిసేవ
యనుచుఁ జేసాచి కన్నుల కద్దుకొనిరి

22 ఉ॥

రంగని మీఁదఁగోపమున రాడనుకొంటిమిగాని నాఁడు శ్రీ
గంగము ప్రేమతోమరల రత్నమునాఁ గనిపించినాఁడు మా
రంగఁడె యామునార్య యతిరాజులసంగతి కల్గకుండనే
వంగతిఁగూర్చె దైత్యసహవాసము స్వామికి రిత్త వోవునే

23 ఉ॥

ఆ యతిచక్రవర్తి చరణాంబుజ దివ్యరజోవిశేష మా
హా !! యిసుమంతమైన మనకందునె యచ్చట దక్కనిత్తురే!
పోయి గ్రహింతమెల్లరము పోదమురండని యిండ్లువీడి వి
చ్చేయఁగసాగి రందుగల స్త్రీలు స్తనంధయులబ్ధ కక్షలై

24 కం

పదములపైఁ బడువారును
పదధూళిని మోముకద్దిబాలురసచ్చో
నదరెడువారును లోలో
ముదమొందెడు వారునైరి మ్రొక్కెడువారున్

25 ఆ॥ వె॥

రంగమందిరమున రాకపోకలు మాని
స్వామి దర్శనైక సంభ్రమమున
గ్రమ్మినారు కంచి గరుడసేవకు మించి
తీర్థయాత్రకొఱకుఁ దిరుగుప్రజలు

26 తే॥ గీ॥

స్వామి ! "ఎంబెరుమానారె" ! భాష్యకార !
సంయమీశ్వర ! మమ్ముల సాకుమనుచు
నంజలి ఘటించి దాసోహమనుచు వ్రాలి
యొక్కతిరునాళ్ల సేసిరదున్నవారు

27 సీ॥

అలనాడు - విద్యార్థి కన్నుమూంచు మాటన్న
లేదన్న బొంకు నిర్వేద మీయ
ఒకనాడు - గురుభార్య నూరక శపియించి
నట్టి సంతాపమూహకు స్ఫురింప
కాంచి పూర్ణఘనుండు వేంచేయ నపచార
మాచరించిన దాత్మగోచరింప
నశ్రుధారాపాత మంతర్ని గూఢమౌ
శోకాబ్ధిఁ గలసి సంక్షోభఁబెట్ట
స్వామి ! యపచారమయ్యెఁ గా పాదుమనుచుఁ
జూపుతో సంయమీంద్రుని జూచుకొనుచు
సకల సంసారితతికిఁ "దంజముగ" నున్న
తంజమాంబయు విచ్చేసి దాలనిలనె

28 కం॥

భవచక్రభ్రమణాదుల
నవనిఁ జని మృత్యురుజల నణగెడు ప్రజఁదా
నవలోకించుచుఁ గరుణా
స్తవనీయుండగుట యోగి చంద్రముఁడనియెన్

29 మ॥

అతి దుఃఖాశ్రయమౌ కుటుంబ విషయవ్యామోహబంధంబుతో
బ్రతుకన్నేర్చిన మూఢులైన ప్రజలారా ! పంచభూతాలచే
నతుకుల్ పెట్టిన పాడుదేహమిది నిత్యంబంచుఁ బ్రేమించు మీ
స్థితికేమందును మీ స్వరూపపదవీ సిద్ధాంతమూహింపుడీ

30 ఉ॥

పుట్టినదాది యీవెనుక పుట్టెను మృత్యుపిశాచి - దానితోఁ
బుట్టువు వార్ధకంబనెడు భూతము - వ్యాధులు దాని జుట్టముల్
పుట్టెడు చీము నెత్తు మలముల్ బలలంబును నింపి తోలుపైఁ
జుట్టిన మట్టిబొమ్మయని చూడకు మీరిది యేమికర్మమో !

31 చ॥

భవమున కాది యీప్రకృతి బంధముహేతువు, తద్విమోచనం
బవుర ! యెఱుంగఁ జాలఁడొకఁడైనను నేటికిగూడ, హా పున
ర్భవము పునర్మృతుల్ గని జరా రుజలన్ దపియింత్రుగాని మా
ధవుని భజించి బాగుపడ దారికిరారిది యేమిచోద్యమో !

32 తే॥ గీ॥

కుసుమములుపెట్టు తలలోనఁ గొఱవిఁబెట్టు
ముద్దుపెట్టిన చేతితోఁ బూడ్చిపెట్టు
తెలిసికొనఁ జాలరైరి యిందలిరహస్య
మెంత ! మూర్ఖులు మానవులీ ధరిత్రి

33 చ॥

విషయమదవాభిలాష పదవీమరుభూముల సంచరించి పెం
దృషకు మరీచికాలహరితీర్థము గ్రోలఁగఁబర్వులెత్తు మీ
విషమసమస్య కెంత పలవింతుఁ గృతాంతనితాంత ఘోరమా
హిషగళ కింకిణీరవములే మిము నిద్దుర మేలుకొల్పుటల్

34 ఉ॥

"తాపము"చేత మీకుభవతాపముశాంతివహించు"పుండ్రముఁ"
బాపును బుండ్రచాపుఁడగు వాని దురంతము "నామ"మన్న నా
నా పరితాప సంతతికి నామముపెట్టును "మంత్ర" మన్నచో
మాపును జన్మ "యాగ"మన మాయముసేయు భవైకరోగముఁ

35 కం॥

తిరుమంత్ర, ద్వయ, చరమ,
స్మరణానందంబె మీకు సద్గతిఁగూర్చున్
బరమోపదేశ మిదిరో
పరికింపఁగ సత్యమైన వార్తయునిదిరో

36 సీ॥

గ్రహియింపరే – శ్రుతిత్రయ సమాహృతవర్ణ
భాసురాష్టాక్షర వైభవంబు
స్మరియింపరే – భవమరుభూగతాగత
శ్రమనివారక మంత్రరత్న మహిమ
పరికింపరే – ప్రాణి పాపాంధకారని
ర్వాపక చరమార్థ దీపకళిక
చరియింపరే – సర్వజనతా సుఖంగ మా
చార్య నిష్ఠైక కైంకర్యపదవి

పారద్రోలరె - దేహ సంబంధులందు
మమ్యమనియెడు భూత మామడల వఱకు
ఈహ సేయరే - యపునరావృత్తి పథము
నందుకొనఁగోరి మీర లహర్నిశంబు

37 మ॥

అవి వాసంతి దినాంతకాల మలయాయాతానిలాంకూర సం
జనితానంద మరందకుందలతికా సౌరభ్యమూరించు తి
య్యని వాగ్ధోరణి సంయమీశ్వరుఁ డుపన్యాసంబు గావింపగా
విని - బద్ధాంజలి నిల్చిరప్డు ప్రజలావిర్భూత విజ్ఞానులై

38 ఆ॥ వె॥

ధవుని బాదములకు దాసోహమర్పించి
యంఘ్రిధూళి నొసట కద్దుకొని యె
దయ్య మయ్యె నాడు తంజమ్మ స్వామికి
దైవమయ్యె నేడు తలచి చూడ

39 తే॥ గీ॥

పంచ సంస్కారదీక్ష నిప్పించు మనుచుఁ
బ్రాకులాడెడు ప్రజల నాపంగ రామి
సంయమీంద్రుండు చేయెత్తి సంజ్ఞ సేయఁ
బలుక కొకవంక గోష్ఠిగా నిలువఁబడిరి

40 కం॥

శరణము – చతురక్షరియే
శరణము – రామానుజార్య చరణద్వయమే
శరణము – తిరుమంత్రద్వయమే
శరణము – తిరుమంత్రార్థముల యనుచు సాగిరి ప్రజలున్

41 చ॥

సమయము మెఱింగి తీర్థము ప్రసాదము సన్నిధినుండి తెచ్చి తా
నమిత భయానురాగముల నచ్చటిస్వాములు కొందఱేము, సం
యమికుల శేఖరుండు మఠమందు వసించెను, శిష్యులెల్ల భా
ష్యమును రచించినట్టివిషయంబు లెఱుంగఁగఁగొల్చియుండఁగన్

ఇది

ధనుర్దాసుఁడు ప్రథమసర్గ



42 మ॥

తన లక్ష్యమ్మొకనాడు వ్యర్థమయి కందర్పుండసంగత్వముఁ
గనుటన్ జూచి తదాది భార్య శరసంధానంబు గావింప నీ
తన శృంగార కళాప్రపంచమునఁ గాంతాదాసులై సంతత
ప్రణయాంభోనిధి నీదు కాముకుల నారాధింతు నశ్రాంతముఁ

శ్రీమతే రామానుజాయ నమః

# ధనుర్దాసుఁడు

## ద్వితీయ సర్గ



43 తే॥ గీ॥

కలఁడు శ్రీరంగ మందొక కాముకుండు
మల్లవిద్యా విదగ్ధతా మాననీయుఁ
డంద మందున మన్మథుపంతవాడు
వాని యర్ధాంగి "హేమ" లావణ్యసీమ

44 ఉ॥

యౌవనరేఖ, శ్రీగల మదాంధ్యము, ప్రాయఁపుటాలు, మల్లవి
ద్యావిభవమ్ము, కామపరతంత్రత, దివ్యకవేర కన్యకా
పావనవాహినీ మధురవాయు కిశోరసుఖానుభూతిని
ద్రావహసౌధవాస మితఁడా ! యతిసూక్తుల నాలకించుటల్

45 ఉ॥

ప్రాయమునందు నున్న ప్రియురాలి విలాసము వాని వెఱ్ఱిగాఁ
జేయుట వీనిరూపమును జిత్తమునందున హేమకెంతయో
హాయిని గూర్చుచుండ ప్రణయంబిటు పెంపువహించుచుండె – లే
దాయె వియోగఘట్ట ముభయాత్ముల కిప్పటి కొక్కనాటికిఁ

46 ఉ॥

పూచిన తమ్మిపూవులన ముద్దులమూటలుగట్టు ప్రేయసీ
లోచనముల్ వినా యితరలోకమువానికి లేనెలేదు త
ల్లోచన రూపసంపదవలోక సుధాంబుధిమున్గు వీనికా
రా ! చెవిసోకునేమి ? యతిరాజునచించు విరక్తివాక్యముల్

47 ఉ॥

నవ్వినమల్లెపూలు – చరణంబుఁగదల్చిన మెట్టతామరల్
కువ్వలు పోసినట్లు – కనుఁగొన్నఁ గుసుమ్ములు రాలునట్లు – లా
జవ్వని నివ్వటిల్ల నతిసౌఖ్యములోఁ బడియుండు వీని కిం
కెవ్విధిగా లభించును యతీశ్వరుఁడిచ్చు సుదర్శనాంకముల్

48 ఉ॥

బాలదివాకర ప్రభకువాడును నేత్రములన్న భ్రాంతి ముం
గేలను ఛత్రమెత్తి సతికిన్ దరినుండెడు కాముకుండు – వీ
డేల గ్రహింపఁజాలును – దురీషణ, దుర్మమతా, వికార ని
ర్మూలన దక్షసంయమి శిరోమణి బోధితతత్త్వ సూక్తులన్

49 ఉ॥

చూపులచేత నుత్పల రుచుల్ గురిపించెడు ముద్దరాలి దృ
గ్రూపి మహార్నిశంబు నపురూపముగా లభియించునట్టి ని
క్షేపము నాగఁజూచుచు విచిత్రమగున్ గనుమూయఁడెంతకున్
వాపియెటీరదాతనికి వానికిఁగావలెనే గురూత్తముల్

50 ఉ॥

మాటికి మాటికిన్ బ్రణయమాధురి నెమ్మది నూటలూరఁ బ
న్నీటి రసంబుచేఁ బ్రణయినీనయనమ్ములు శుద్ధిసేసి లోఁ
గాటుక రేఖగా నలఁది కన్గొని మోదసుధాబ్ధి నీదు నీ
లాటి దివానిశం విషయలంపటుఁడా ! యతి సూక్తినెంచుటల్

51 ఉ॥

ప్రేయసి కన్నుమూసి నిదురించిన రేయిగఁ, గన్ను విప్పినన్
హాయినిగొల్పు వేకువగఁ, నాత్మఁదలంచుచుఁ దద్విలోచనం
బేయెడ దృష్టిసోకి నశియించునొ యన్న విభీతి రక్షగాఁ
జేయును నిర్నిమేష వికచీకృతదృష్టి సహో మమత్వముల్

52 ఉ॥

ప్రేయసి ముద్దులొల్కు కనురెప్ప చలించినరీతి సేవలన్
జేయుచుఁ దత్కటాక్ష వికచీకృత భావగుణైక బద్ధుఁడై
హాయిగఁ గాలమెల్ల విషయస్పృహతోఁ దదనూనలోచన
స్థాయి దహర్నిశేక్షణ రసజ్ఞతతోఁ జను నా విలాసికిన్

53 ఉ॥

దేవుఁడు, తల్లి, తండ్రియును, దేశికుఁ, డాప్తుఁడుఁ, తోడునీడయున్,
సేవకుఁ, డిల్లు, వాకిలియు, స్నేహితుఁ, డీ సకల ప్రపంచ మా
దేవియె కాని వేరొకటి తెల్పఁగఁ జాలము వీనికున్న దా
యానదనూన సంపదయు నాఁడుమ కన్మని లోచనమ్ములే

54 శా॥

ప్రాసాదోపరిచేటికారచిత శయ్యాసీమఁ గావేరి వీ
చీ సౌఖ్యావహ శీతలానిల సుధాసేవావిలోలాలక
శ్రీ సౌందర్య కళానిధాన ముఖలక్ష్మీ స్మేర ముగ్ధకాంతేక్షణ
వ్యాసంగుండెటు లాలకించు యతి వేదాంతోక్తి సిద్ధాంతముల్

55 ఉ॥

లోచన రూపసంపదకు లోకువయయ్యె మగండటన్న లో
దోఁచిన గర్వరేఖ తనతోడిదె లోకము భర్తకన్న ము
ద్వోచిక - యిట్టి హేమ మురిపించెడు మోహనికుంజమందు దో
బూచులనాడు నీప్రణయ ముగ్ధనకా ! యతిరాట్ప్రసంగముల్

56 ఉ॥

కామిని లోచనమ్ములకుఁ గాటుక పెట్టుటొ - కమ్మకస్తురిన్
బాముటయో స్తనద్వయికిఁ బాదములందున లాక్షఁబూయుటో
జాములు జాములిట్టె పనిసందడిలోఁ బరువెత్తసేయు నీ
కాముక చక్రవర్తి వినఁగల్గునె స్వామి మహోపదేశముల్

57 ఉ॥

ప్రేమ ద్విధా విభక్తమగుకేతి రతిస్మరులేవిధమ్ముగా
భూమి జనించినారనఁగ ముద్దులుగుల్కెడు రూపురేఖతోఁ
గాముక చక్రవర్తియును గామినియున్ జనదూరదృష్టిలోఁ
బ్రేమ కళాస్వరూపులని పేరుగడించిరిఁకేమి చెప్పెదన్

58 చ॥

విరిసిన పూలతోఁ గలిపివేసిన వాల్జడ ప్రేలుచుండఁగాఁ
బిరుఁదుల గేలఁబట్టి భయపెట్టఁగఁ బెన్మిటి నొక్కనాడు నీ
దరికిదె వచ్చెవచ్చెఁ బెనుత్రాఁచని మీఁదికిఁబైన భర్త త
త్తరపడి కౌగలింప సతి తాను పకాపకనవ్వె – నంతటన్

59 ఉ॥

ప్రేయసి ! నన్ను నీవు భయపెట్టితి వాల్జడ పామటంచు నీ
చాఁకురాను నేననుచు సంజనిత ప్రణయాపరాధ రే
ఖాయుత కోపభారమున గాముకుఁడేగుట కుద్యమింప స్వా
మీ! యపచారమయ్యెను క్షమింపునా గయిమోడ్చి హేమయున్

60 ఉ॥

ఇంతకె ! యింతమాత్రమునకే ! యిసుమంతకె ! యింతదానికే
యింతటి కోపమైన భరియింతువె ! నీ ప్రణయానుబంధ శా
మంతి సువాసనా లహరిమాధురికిన్ వశమైననన్ను నీ
వింతటి గాసిపెట్టఁ దగునేయని తాను వహించెఁ గోపమున్

61 చ॥

సరిసరి ప్రేయసీ ! యిఁకను జాలును ప్రేమరుషాస్త్రిలోని సం
బరములు సంధి సేసుకొని మాటలుమాటలు కల్పుకొంద మీ!
వర కిటువంటి దెన్నడును స్వప్నమునందు నెఱుంగజాల మి
ర్వుర మరియేమొకాని చెడురోజిది శాంతి కుపక్రమింతమా !

62 చ॥

అని సతిఁ జేరఁదీసి తమియారఁగఁ దియ్యఁగఁ గౌఁగలించి లోఁ
బ్రణయరుషాప్తి మాన్ప నధరంబున ముద్దిడఁబోవఁ జాలు నీ
ప్రణయము ధూర్తుఁడా ! యెవతెరా ! యదినీదు కపోలసీమలోఁ
గనబడుచున్న దామెమమకారము నాకడ సూపవచ్చితే

63 ఉ॥

నీకపటానురాగములు – నీ కుహనాప్రియ భాషణాదులున్
సాకులుజెప్పి నన్ను మృదుశయ్యకుఁ దార్చెడు నీవిలాసముల్
మాకడఁ జెల్లవింక బతిమాలి ప్రయోజనమేమి లేదహో
నీకును నాకుఁ దీరినవి నేటికిఁ బ్రేమ ఋణానుబంధముల్

64 ఉ॥

కామిని ! వేణి దెబ్బలకుఁ గమ్మనికాయము కందిపోయె నీ
ప్రేమ సుధాబ్ధిలోఁ బులకవీచులు వేలనతిక్రమించె నా
స్వామిని నీవు నీకుఁ బరిచారకుఁడీతఁ డటంచుఁ జూపు త
త్ప్రేమ ప్రదర్శనంబు తెరదింపి ముగించితె నేడు ధూర్తుఁడా !

65 ఉ॥

ఏక సతీపరాయణుఁడ వీవను నమ్మకముండెఁ గాని నా
నా కులటాంగ నా ప్రణయనాటక మాడెద విట్టులంచు నా
రా !! కలనైన నేనెఱుఁగ నట్టిననున్ గడుమోసగించి యెం
తో కుహనానురాగమును ధూర్తుడ ! చూపెద వీ విధంబుగన్

66 ఉ॥

కంటికి గానుపింపనిది కాదని బొంకులు బొంకవోకు నా
కంటికి లేదయిందనుకఁ గానగరాని తనంబు ధూర్తుఁడా !
తుంటరి కామినీ మమతతో ముఖమందున బెట్టుకొన్న నీ
వంటి కృతఘ్నుతోఁ జెలిమి భస్మసమర్పిత హవ్యమేకదా

67 ఉ॥

చాలును జాలు పొమ్మికను జారవధూసముదాయ నీచ దో
ర్మాల తటీప్రదేశమును ముట్టి యథః పతితుండనైతి నీ
వ్రేలటు సోకనేని యపవిత్రత గాంతు నిజమ్మటంచు ముం
గేలఁ దొలంగఁద్రోచెఁ బతికేలును బ్రేమరుషాగ్నితప్తయై

6 ఉ॥

అట్టు తొలంగఁద్రోచి పతిహస్తము మెత్తని పూలసెజ్జపై
నిట్టటు దొర్లుచుణ్ గనుల నిండిన వెచ్చని భాష్పపూరముల్
పట్టగరాని లోఁబ్రణయబాధ తపించెడు భార్యమీఁదఁ జై
నెట్టె కరమ్మునైచి మగఁడిట్లు వచించె మృదుస్మితమ్ముగణ్

69 ఉ॥

అయ్యయొ ! వెఱ్ఱిదాన ! యదియంతయు వట్టిది నిర్నిమిత్తమీ
కయ్యముఁ దెచ్చి పెట్టితివికాని నిజానకుఁ గారణమ్ము లే
దియ్యెడ నాకపోలమున నీవె స్ఫురించితి వావిధాన నే
దయ్యముఁదెచ్చి నేను దలదాల్పన యింకొకమారు చూడుమా

70 ఉ॥

నిన్నొక నాటికిక్క బ్రణయినీ ! కలనైనను మోసగింప నీ
కన్నుల తోడు నీచరణకంజములాన నిజమ్ము సుమ్ము నీ
కన్న మఱొక్కదానికెరగా డితఁడెప్పుడు నా కపోలమం
దున్నది నీవెకాని మరియొక్కతె కాదు పరీక్ష సేయుమా

71 ఉ॥

ఇంతటి స్వల్ప హేతువునకే యిటులైతివి - ముందుముందు నిం
కెంతటి వంతరాగలదొ యిర్వురి జీవితరంగమందు ర
వ్వంతగ నాందినేడు మొదలయ్యెను పాత్రలు నీవునేను గా
వింతము హావభావపదవీ నటనాదులు లెమ్ము ప్రేయసీ

72 ఉ॥

అని సతి లేవనెత్తి దరహాసముతో స్వకపోలదర్పణాం
బున ప్రతిబింబమందెవరి పోలికలున్నవొ చూడుమన్న సి
గ్గునఁ బతికంఠసీమ కుసగూహనమిచ్చి మహాపచార మ
య్యెనుక్షమియింపుమాయనుచు హేమయనన్ గడుజాలిచూపులన్

73 తే॥ గీ॥

పొలయలుక నాటి నిద్రకు విలువలేని
మాట నిజమైన వారి కామాట దక్క
గోరువంకయుఁ జిలుకయుఁ జేరినట్లు
మునమొనస్తురు హేమ, కాముకుఁడుఁగూడి

74 తే॥ గీ॥

యౌవన విలాస రేఖ - నిత్యంబ యేని
జీవితాపగ - మరుమరీచికలుగాక
సత్యమగునేని సంసార సౌఖ్యమందు
కొఱత వారలకెపుడు రాకుండుగాక

75 సీ॥

అభ్రభస్థలీస్యంద దమరాపగా తటీ
పరిచరద్దేవ దంపతులనంగ
శృంగార సామ్రాజ్య సింహాసనాసీన
సరసవైభవ రతిస్మరులనంగ
నందనారామ భూనవివహారానంద
సంపదాకర శచీశక్రులనఁగ
మంజు మానససరోహమనీయ వీచికా
హూత హంసీ హంస యుగళమనఁగ

నిమిష నిమిషైధమాన నిశ్చిద్ర దివ్య
మధుర మధురాతిమధుర ప్రేమస్వరూపు
లనఁగ నిసుమంత కలఁత లేదనెడురీతిఁ
దిరుగుచుండిరి వారి యదృష్టమేమో !

76 శా॥

కావేరీనది కొక్కనాఁ డుదయదర్క స్ఫూర్తి కాలంబులో
దేవీలోచన రక్షణార్థమయి ప్రీతిన్ జాపదాసుండు తాఁ
ద్రోవన్ ఛత్రముఁబట్టియుండ నదియేదో చూచెరామానుజుం
డావిర్భూత మహాపవిత్ర కరుణావ్యాపార మేపారఁగన్

77 మ॥

అనురాగాస్పద కామినీ నయనరత్నానంద వారాశిలో
మునుకల్ పెట్టెడు వానిభాగ్యమున కామోదించెనో! ఖేదమొం
దెనో! కానీ – కనురెప్పపాటు నిలచెన్ దృష్టిన్ ప్రసాదించి యే
మని భావించెనో వెంటనేమరలె శిష్యశ్రేణి వెన్నంటఁగన్

78 ఉ॥

సూర్య కరప్రసారములుసోకి మనోహర నేత్రకాంతి మా
ధుర్యము వాడునేమొ యను తొందరలో నొకయాతపత్రమున్
భార్యకు ముందు పట్టుకొనివచ్చుచునుండెడు నాతఁడిప్పుడా
చార్యుఁడు నిల్చిచూచినది జాచియె తానెఱుఁగండొకింతయున్

79 తే॥ గీ॥

వేలకొలదిగఁ బుష్పముల్ పృథివినున్న
సూర్యకిరణము తమ్మినే చూచునట్లు
లక్ష్మణార్యున కాప్తులు లక్షలున్నఁ
దత్కటాక్షము హేమకే తారసిల్లె

80 ఉ॥

పావనశీలుఁడైన యతివర్యుఁడు ముంగిట నిల్చి చూచుటా
దేవి యెఱుంగుటల్ బతికిఁదల్పె గురుండదె పోవుచుండె నీ
త్రోవ గమించినాఁడదిగో ! తూర్పున కేగెను నారికేళశా
ఖావృతవీథిలో నిలిచెఁగావలయుల్ బ్రజలుండి రయ్యెడల్

81 ఉ॥

దేశిక సార్వభౌముఁడట ! దేవునితో సరితూగునంట ! సం
దేశములిచ్చి లోకులకు దివ్యపథమ్మును జూపునంట ! వై
దేశికు లెందఱెందరో తదీయ పదాంబుజ సేవకోస మీ
దేశముఁ జేరిరంట ! తగదే ! మనమాతనిఁ జూడ గల్గుటల్

82 ఉ॥

ఎంత మహాపచారమిది ! యెంత ప్రమాదము సర్వధారుణీ
కాంత శిరః కిరీట కళికావిలసన్నవరత్న మాలికా
కాంతి సమర్పనీయ పదకంజుఁడు పూజ్యుఁడు సంయమీంద్రుఁడీ
ప్రాంతము వచ్చి త్రోవనెడుదైన నెఱుంగకపోతి మింతయుల్

83 మ॥

మనమా దేవుని జూడకున్న నతఁడే మందారమారంద ధా
రను, నిందించెడు దివ్యమైన కరుణార్ద్రింబైన, యాకస్మికే
క్షణ సౌభాగ్య మొసంగినాఁడుఁ జగదాచార్యుండు తానిల్చు ని
ల్చిన దాసోహము గానపోయినను వీక్షింపంగ లేమైతిమే

84 చ॥

ఇదియొక సుప్రభాత మిదియేసుమి జీవితకాలరేఖలో
సుదిన మిదే మిథః ప్రణయశోభిత కావ్యకథానుభూతికిన్
దుది – యిదియేసుమీ విషయదోషదవానలమార్చు సత్కృపా
నది – మునుముందు నియ్యెడె పునర్భవశాంతికి దారిఁజూపుటల్

85 సీ॥

పావనాసూర్యస్వవాయు దుగ్ధాంభోధిఁ
గువలయాప్తుఁడు నాఁగ నవతరించి
పుణ్యదేశఖ్యాతి పొలుపారు శ్రీ పెరుం
బూదూరు నొక పుణ్యభూమిఁ జేసి
శ్రీకాంతిమతిదేవి శ్రీ కేశవార్యుండు
జననీజనకులౌట సమ్మతించి
భవబంధ మోక్షసంపదకుఁ దంజమ్మైన
తంజమ్మ కన్య నుద్వాహమాడి

కంచిలో నుండె నొక మహాఘనుఁడటంచుఁ
దొలుత వింటిమి యతఁడె కావలయు నితఁడు
సంయమిగ నేడు మనకు సాక్షాత్కరించె
నడచి వచ్చిన ప్రజల పుణ్యంబనంగ

86 ఉ॥

ఈవొకసారి వారికడకేగి పదాబ్దములందు వ్రాలి త
ద్ధీరుని బాదుకారజము తీసుకరండిట నంతదాకఁ గా
వేరి దరిన్ రవి ప్రభలవేడికిఁ గన్నులు వాడకుండ నేఁ
జేరెద నారికేళవనసీమ నదేగురుఁడేగు డీయనన్

87 కం॥

చిఱునవ్వు నవ్వి చెలియా !
గురువీక్షా వాగురమున గూలెడు పక్షుల్
పరికింప నేరయున్నవి
తరుణుల మాజోలి మనము తడవఁగనేలా ?

88 ఉ॥

ఆతఁడు దేవుఁడైన మనకైనది పోయినదేమి లెమ్ము – ప్రా
భాతిక పంకజాతనవపత్ర విలాసమునాహరించు నీ
నూతన లోచనమ్ములు కనుంగొన నిల్చెనుగాని కావు సం
ప్రీతులు యోగికేమి మనమీఁదఁగటాక్షములేమి ప్రేయసీ !

89 ఉ॥

ప్రేమ సుధాపగాఝురికి వేసవి – కామకథా మరుత్తురున్
బాము – సుఖాబ్ధివీచులకు బాడబకీలి శిఖావిజృంభమో
హేమ ! సతీపతి ప్రణయవృక్ష కుఠారము – చూడఁబోకుమా
స్వామి కటాక్షమూడిపడు నైపునకే వొకనాటి కేనియున్

90 చ॥

అతఁడు సుఖాభిలాషకుఁ దిలాంజలిసేసి త్రిదండధారియై
బ్రతుకుచు నిల్లులేక యొక వాకిలిలేక బికారియౌచు సం
తతముఁ జరించుచున్న జడదారిగదా మనమేవిధాన స్నే
హితులము కాఁగలారము రుచించునె ! యోగికి భోగిబంధముల్

91 ఉ॥

ఈవిషయంబునింక విరమింపుము ప్రేయసి ! సంయమీంద్రు సం
భావన సేయువారిచట వందలు వేలుగలారు వారి కా
త్రోవ, సుఖాభిలాషికిది త్రోవ, పరస్పర మేవిధమ్ముగా
భావము లైక్యమందు నటువంటిది వచ్చిననాడు చూచెదన్

92 ఉ॥

అప్పుడె జాము ప్రొద్దు గతియించెను ప్రేయసి ! పోదమింక ర
మ్మిప్పుడు కాదులెమ్ము మనమీతని దివ్యకథావిభూతులన్
జెప్పుచుఁ బ్రొద్దుపుచ్చుటది చేరువకింకను జేరలేదు ముం
దెప్పుడొ నిన్నొ నన్నొ గురుదేవుఁడు లాగకయూరకుండునే

93 చ॥

అని హృదయేశుఁడన్న వినయమ్మున మ్రొక్కుచు దాసురాలి ప్రా
ర్థన మొకసారి సార్థకము తప్పక చేసియె తీరగావలెన్
జనుఁడని వేడుకొన్న సతి - స్వాంతమునందున నేమికోపగిం
చునొ యనిసంశయించి గురుఁజూడఁగ నున్ముఖుఁడయ్యెనంతటన్

94 తే॥ గీ॥

ప్రణయినీ తీవ్రయాచనాగ్రహముఁ బట్టి
ముందు వెనుకలఁదనకు నూపులు గుదింప
తూర్పు పడమర వీచు వాతూలమునకు
వీచికలఁదూగు రాయంచ విధిగ నుండె

95 మ॥

అతికష్టంబున బ్రేయసీ వినయభవ్య ప్రార్థనా పాశబం
ధిత చిత్తంబును సంయమీంద్రు కడకేతేరఁ బ్రయత్నించి హా
ద్భిత మైనట్టి శుభాధ్యయా శకున మేదీ లేని వ్యాజమ్ముతో
నతివా ! దూరముపోయె నాగుముఁడు రేవ్వాని సేవించెదన్

96 తే॥ గీ॥

అనుచు వెనుకంజ వేయఁ జయ్యనలతాంగి
మారు మోమున గన్నుల నీరునింపఁ
జేయునదిలేక సంయమి సేవ కొఱకుఁ
గదిలె నేమేమి తలచెనో తుదకతండు

ఇది

# ధనుర్దాసుఁడు
## ద్వితీయసర్గ



97 తే॥ గీ॥

మంచి శ్రమమూని - నిధిని శోధించి - మణిని
వెలికిఁ దీయించి - దానికి వెలలుగట్టి
సాన కెక్కించి, చక్కగా సాపుఁజేయు
చుంటివే రీతి నిది యుపయోగపడునో !

శ్రీమతే రామానుజాయ నమః

# ధనుర్దాసుఁడు

## తృతీయ సర్గ



98 తే॥ గీ॥

యతి పురందరుఁడంత రథ్యాంతసాగి
తేజరిల్లెడు "వేదాంతదీప" మనఁగ
నారికేళద్రుమపూగ రంభారసాల
శీతలచ్ఛాయఁ దిరువీధిఁ జేరి నిలిచె

99 ఉ॥

వాఁడె ముకుందు రండనెడు వారొకకొందఱు, పూర్వపుణ్యముల్
నేఁడు కదా ఫలించినవి నేఁడుకదా మనలక్ష్మణార్యులీ
వాడకు వచ్చినారనుచు వారిని వీరిని బిల్చుకొంచుఁ బె
న్వేడుక లూటలూరఁ దిరువీధికి మూఁగిరి కొందఱయ్యెడన్

100 ఉ॥

రంగని చూచినట్టులఁ గరమ్ములు రెండును ఫాలిఁ జేర్చి సా
ష్టాంగ నమస్కృతుల్ సలిపి సంయమిశేఖరు పాదధూళిఁ గ
న్నుంగవ కద్దువారును, గనుంగొని మోదరసప్రవాహముల్
పొంగఁగఁ జిత్తమందుఁ, బయి మూఁగిరిస్వామికిఁ జుట్టుపైత్రికుల్

101 ఉ॥

అంగడులందు వెచ్చములఁ నమ్మెడువారును, బూలదండలన్
రంగనికీయఁబోవ నెదురై యొకప్రక్కకు నొత్తిగిల్లు వా
రంగనలున్ గుమారులు గృహాంగణసీమలఁ జేరినిల్చి ని
స్సంగుని జూచువారయిరి సంయమిశేఖరుఁ డేగుచుండఁగన్

102 ఉ॥

కోఽయమితి బ్రువాణులగు కొందఱు, కింకిమితి క్వయాతి కిం
వా యతిశేఖరః కిమనువారలు కొందఱు, లక్ష్మణో ముని
స్సోఽయమిహాగతః కిమితి యారయువారొక కొంతమంది, యే
చాయను జూచినన్ జనులసందడి మిక్కుటమయ్యె నయ్యెడన్

103 ఉ॥

ఆజగదేక సద్గురుని యప్రతిమాన ముఖాబ్జమండలీ
తేజము దుర్నిరీక్షమయి దిక్తటులందున బిక్కటిల్లగా
యోజన సేయసాగిరెదియో యిదిచూడఁగ మానవాకృతిన్
రాజిలు దేవతాంశయని ప్రౌఢకళావిదులైన పండితుల్

104 చ॥

జలదదళావృతుండయిన చంద్రునిభాతి - పరాగకుంఠితో
జ్జ్వలకనకమ్మురీతి - మనవంటి శరీరము లెత్తి దేవతా
కళ నలరారు గొందఱు గ్రాలుచునున్న నెఱుంగలేరు బ
ద్ధులు - విషయాంధకారగతి దోషసమావృతలోచనుల్ గదా

105 ఉ॥

పాడు జగమ్మునగాన భగవంతుఁడు తానవతారమెత్తి శా
పాడఁగ వచ్చియున్న మనవంటి మనుష్యుఁడె క్రొత్తయేమి నా
మూఢుడు వాగియామనసు పుండొనరించెనుగాని యక్కటా
లేదుగదా యథార్థము నెఱింగి తరించెడువాఁడు నేటికిన్

106 చ॥

విపినముఁజేరి, గడ్డములుపెంచి, జలమ్ములుగ్రోలి, యొంటిగాఁ
దపమొనరించి సిద్ధుఁడయి తానుదరించుట గొప్పగాదు దు
ర్వ్య పదతిగర్తమందుఁ బలవించెడు జీవులఁజూచి జాలిగా
నుపకృతి సేయఁబూనుటయె యుత్తమధర్మము యోగులౌటకున్

107 చ॥

పరమతపోనిరూఢి భగవంతుని సాధనసేసి తత్త్వమున్
గరబదరీ సమానముగఁగాంచి తరించునొకానొకండు — కొం
దఱు — మహనీయులెవిషపు దావవనాయితబద్ధ చేతనో
ద్ధరణమె సార్థకమ్మనుచుఁ దాముతరింపఁగఁజేతు రన్యులన్

108 ఉ॥

వంశలు వేలు లక్షలు నపారముగా జనియించి ధాత్రిలో
నెందఱో ! క్రమందుచుందు రిదియేమి విచారణలేనె లేద — యా
సందున నెవ్వఁడో యొకఁడు సాధువు పుట్టి జనావనంబు సే
యందలఁ బెట్టి జీవితము నంకిత మిచ్చు మహానుభావుఁడై

109 చ॥

తన సుకృతమ్ము మంచిదని దైవమొకానొక శక్తినీయ దా
నిని తమకోసమేయని గణింపక యెవ్వడు బద్ధజీవిర
క్షణ మొనరించునో యతఁడె జ్ఞాని, పరాత్పరుఁడిట్టి వానినే
యనును మదాత్మయంచుఁ దుదకాతఁడె దైవము జంతుకోటికిన్

110 ఉ॥

జ్ఞానము లేని యాపశువు జాతిమతమ్ములు లేని పక్షి యున్
దానొక గూడు కట్టుకొని దారసుతాదుల పోషణార్థమై
కాననవీథిలోఁ దిరిగి గ్రాలుచునున్నది మర్త్యుఁడల్లె సం
తాన కళత్ర రక్షణ విధాయకుఁడైన విశేషమున్నదే ?

111 ఉ॥

ఆ గగనంబునందు జలజాప్తుఁడు దాను స్వకీయ తేజమున్
ద్యాగము సేసి లోకులకు నంధతమస్సును బాపినట్లుగా
యోగముచేత నాత్మబలమొందిన యొక్క తపస్వి బద్ధులన్
బాగొనరింపఁగాఁ దలఁచి పాటుపడున్ జగదేకబంధుఁడై

112 ఉ॥

ఒక్కఁడు తా స్వపోషణపు యోజన సేయుఁ గుటుంబపుష్టికిం
కొక్కఁడు, గ్రామమంచు మరియొక్కఁడు, రాష్ట్రముకోసమొక్కఁడిం
కొక్కఁడు దేశశాంతి, కిటులుండుటకన్నఁ బరత్ర దృష్టితోఁ
బెక్కుర నుద్ధరించుటయె విశ్వజనీనపు ధర్మమొంతయున్

113 చ॥

కలిపురుషుండు వేదములుగాల్చె, సనాతనధర్మ వల్లికా
వళి మొదలంటఁగాఁ బెరికివైచెఁ, బురాణములెల్ల వార్ధిలోఁ
గలిపెను, జాతిభేదమత గౌరవమంతయు రూపుమాపె, హా
కలిగెను ధర్మసంకటము జ్ఞానికిదేసమయమ్ము లేనఁగన్

114 ఉ॥

అల్లదె ! మాటలోన నెదురయ్యెను జల్లనితండ్రి యల్లదే
సల్లలితాంత రంగమున సంయమిశేఖరుఁడేగుదెంచి నా
డల్లదె ! ధర్మహానిసమయంబున శ్రీవిభుఁ డేగుదెంచుటల్
పొల్లనరాదు సూ పరమపూరుషశక్తికి భంగమున్నదే

115 ఉ॥

వలిన వాని జేష్టితము లెవ్వఁడెఱుంగును దత్స్వరూపమీ
త్రోలు మొగాలకా ! హరియెదో యొకరీతిగఁ జేపగానొ, తా
బేలుగనో కనంబడి తపించెడు జీవులనుద్ధరింపఁగాఁ
జాలి వహించుఁగాని కనఁజాలదు లోకము కన్నులుండియున్

116 చ॥

కలిపురుష ప్రభావమున గాలుచునున్నది లోకమెందుఁ గ
న్మలపినగాని లేదు పరమాత్మకు స్థానము జన్మలెత్తినన్
ఫలమిఁక నెంతమాత్రములనంబును లేదని రాయిరప్పగా
నిలచెన యెవ్వరింక గమనించెడు వారలు లోకదుస్థితిన్

117 ఉ॥

దేవుఁడు లేనివాఁడొకఁడు, దేహము నాత్మనుగాదలంచి సం
భావన సేయువాఁడొకడు, వానికినాకు నభేదమంచు వా
దావహమూను వాఁడొకఁడు, తత్త్వమహారథమిట్లు చోదకా
భావము చేతనేమొ పెడబాటలుపట్టె నికేమిసేయుటల్

118 ఉ॥

శ్రీదయితుండొనర్చ నిదిసేయునుదాసుఁడు దానికంబరీ
షాదులె సాక్షులౌదురు – మహాబ్ధినిదాటఁగ శక్తిలేక ని
ర్వేదముఁ బూనె రాముఁడవలీలగఁదాటె సమీరసూతిదా
మోదరుకన్న భక్తుఁడె మహోత్తముడెన్ని విధాలఁజూచినన్

119 ఉ॥

వేదము సేయలేనిపని, విశ్వనియంత మొనర్పలేక ని
ర్వేదముఁ బూనినట్టిపని – వీనికతంబున సార్థకంబగున్
లేదిఁక సందియంబు లవలేశముకూడ నిజమ్ము స్వామి శ్రీ
పాదము లాశ్రయింపఁగల భాగ్యముగల్గుట యెంతవారికో

120 ఉ॥

ముద్దులుగుల్కు మోము పయి పుండ్రపు రేఖలు పుండరీకముల్
సద్దనిపించు నేత్రములు బాపురె! చూడఁగ వీనియందెదో
కద్దు విశేష మీ యతిశిఖామణి రూపము పంచదారలో
నద్దిన ద్రాక్షకన్న రుచియున్న యథార్థము కాకయుండునా?

121 ఉ॥

వైష్ణవజాతికెల్ల నొకభాగ్యము కల్గెను నేటినుండి శ్రీ
వైష్ణవ సంప్రదాయ మిఁక వ్యాప్తివహించు, మతప్రచార వ
ర్ధిష్ణువు లక్ష్మణార్యుఁడిదె రెండువిభూతుల యాధిపత్యముం
విష్ణువొసంగ నందుకొని పృథ్వికిఁ జేరె నహో యదృష్టముల్

122 శా॥

పాషండ ద్రుమషండ దావదహన ప్రఖ్యాతితో నున్న యీ
కాషాంబరధారియొగద జగత్కళ్యాణ సంధాయియై
భాషాయోషకు భూషణంబయిన శ్రీభాష్యంబుఁ గల్పించె నా
శేషుండీతఁడు గాకయున్న నిది సృష్టింపంగ సామాన్యమే

123 ఉ॥

ఈవిధి దేశికేంద్రుఁ గథలెల్ల మహాత్ములు భక్తిమీర సం
భావన సేయుచుండ గురువర్యుఁడు వారలకెల్ల దృష్టితో
దీవెనలిచ్చుచుం మఠపుదిక్కున కేగుటకుద్యమింప హే
మా విభుఁడొక్కచోఁ బ్రజలమాలునఁగన్పడెవింతగొల్పుచుం

124 ఉ॥

మూపునను త్తరీయమును, మోముసమూగినముంగురుల్, మణీ
దీపితమాల కంఠమున, దెల్లని కంచుక మగ్నిశోధితా
ష్టాపద మట్టులున్న తమసంపద, తత్తళలీను కమ్మలుం
జూపరులెల్ల మారుఁడని జూడఁగఁ ద్రిమ్మరుచుండె గుంపునం

125 ఉ॥

గుంపులు గట్టి నల్గడలఁగూడిన లోకులడాయ లేక యే
చెంపకుఁ బోయినన్ ప్రజలుసేయు భుజాహతికోర్వలేక, తా
ద్రెంపిన తమ్మితూఁడన శరీరమువాడఁగ దేశికున్ సమీ
పింపఁగఁ జూచుచుండెఁ గనిపెట్టఁడొకండును వానియాతనన్

126 ఉ॥

కమ్మని భార్య నేత్రములుకందునొ యేమొ నవారుణప్రభా
తమ్ములు సోకియుంచు నొకదైన్యము తీరనిబాధ - లేదు నే
డిమ్ముని పాదధూళి మనకిచ్చెడు భాగ్యమటన్నవంత, శో
కమ్ము వినాలభించినది కన్పడదాతనికాక్షణమ్మునన్

127 ఉ॥

వచ్చెను గాని దేశికుని బాదపరాగముగోరి ప్రేమతో
నిచ్చిన స్వీకరింతమని, యెంతకు సంయమిదర్శనంబె ని
ష్పచ్చరమయ్యె దారి కనుపట్టదు స్వామిని డాయఁబోవఁబైఁ
బెచ్చు సతీప్సితంబిఁక లభింపదు గావలెనన్న బాధయున్

128 ఉ॥

ఎంతటి యార్తియుండవలె ! నెంత వివేకము నొందఁగావలెన్
ఎంతటి భక్తి నూపవలె ! నెంత విరక్తిని బూనగావలెన్
ఎంతటి జ్ఞానమూనవలె ! నెంత మనోవ్యథ నుందగావలెన్
ఇంతి ముఖంపుఁ బ్రీతికి లభింతురె యోగులు కాముకాళికిన్

129 ఆ॥ వె॥

స్వామిఁజేరఁబోవ సాధ్యమ్ము కాకుండె
జనముఁ జూతుమన్న సందులేదు
తిరిగి పోవనున్నఁ దరళాక్షి వ్యథనెందు
దోఁచకేమి యతఁడు తూలిపోయె

130 ఉ॥

వానియవస్థఁ గంటఁగని పాపము జాలినహించెనేమొ రా
మానుజసంయమీంద్రుడు, మహా త్తరమానజనత్తాప్రవాహముల్
దా నవలీలదాటి యొకదారి వివిక్తపథమ్ము నేరె హే
మానళినాక్షి భర్త కొకమాటున దర్శనమిచ్చు కోర్కెమై

131 ఉ॥

అమ్మ ! లభించె మంచిసమయంబని సంతసమంది తావివి
క్తమ్ముగ నున్న దేశికుని దాపునకుం జని దండప్రణా
మమ్మొనరించి తొట్రిలెడుమాటలతో నపరిస్ఫుటార్థ్రి నా
దమ్మున గేలుమోడ్చి వినతస్థితి సంయమితోడ నిట్లనున్

132 క॥

అపచారమయ్యె - దేవర
కృపతోఁ దిరువీధి మమ్ము నీక్షించుట నే
నపు డెఱుఁగనైతి నేదో
చపలత - సైరింపవలయు స్వామీ ! దోసఁగుల్

133 ఉ॥

దేవర పాదధూళిఁ గొనితెమ్మని - ప్రేయసి - కాదు, దాసురా
లీవిధి నన్నుఁ బంపఁగఁ దదీప్సిత సిద్ధికిఁజేరినాఁడ మీ
పావనమైన సన్నిధికి వచ్చిరమారమి జాముదాక మీ
సేవకు వేచియుంటి గురుశేఖర ! దాసుననుగ్రహింపుమా

134 ఉ॥

ప్రొద్దదె ! చూడుమా గడిచిపోయె రమారమి జాముదాక మీ
యొద్దఁ బదాబ్జధూళి గొననుండిన నింకొకజాము కూడఁబైఁ
గద్దనిపించు నందనుకఁ గావెరిగట్టున నున్న దాసురా
లద్దిర ! యెంతబాధపడునయ్యొ కనుంగన రక్షలేమికిఁ

135 ఉ॥

కావున దాసురాలనిన కాంక్షితముఁగా నెరవేర్చి వెంటనే
దేవర పంపఁగా వలయు దివ్యకటాక్షముసూపి యల్లదే
కావెరి ! దాసియల్లదిగొ ! కన్నులు వేడికివాడి వత్తలై
పోవునొ! యేమొ! స్వామి; యవిపోయిన నాఁబ్రతుకేల చెప్పుమా

136 చ॥

అనియతఁడట్లెచూచివినయమ్మునమ్రొక్కుచుసంయమీంద్రుపా
వనమగు పాదధూళి వయిపంచెకునింపి బిగించుచుండ వా
నిని - ముని - లేవనెత్తి తగునేయిదినీకని పారఁబోసి ర
మ్మని తనచేతితో నతనిహస్తముఁబట్టి ప్రసన్నదృష్టియై

137 ఉ॥

సాగుచునుండ శిష్యులగుస్వాములు కొందఱు సంయమీంద్రుఁడీ
భోగినిదాకి మైలపడిపోయె నయోయని గోలసేయుచున్
మూగురు లిట్లుసేయుచు నె ! ప్రమాదము, సాహసమంచుఁజాటుగా
మూగిర యాభిజాత్యమను మోహము కన్నులఁదట్టియుండఁగన్

138 ఉ॥

అక్కట ! యెంతమాట ! యెవరైననుజూచిన శూద్రజాతి వా
డెక్కడ వీడు కామి జగదేకగురూత్తముఁడైన యోగిరా
జెక్కడ ! నీతినిష్ఠలిఁక నెక్కడనున్నవి వర్ణధర్మ మిం
కెక్కడ నిల్చుఁబట్టుకొనె నీతనిచెయ్యి నిదేమి చర్యయో

139 ఉ॥

స్నానముఁజేసి, శుద్ధుఁడయి, సంధ్య, జపంబును, నిష్ఠతో నను
ష్ఠానమొనర్చి లోకులకు జ్ఞానపథమ్మును జూపుచున్న రా
మానుజయోగిచంద్రుఁ డవురా ! యిదె నాలవజాతివానిఁ జేఁ
బూనెను బెద్దవారె కలిమోహములోఁ బడిరేమిసేయుటల్

140 ఉ॥

మొన్నను మేలుకోట గుడిముందుకుఁ బంచమజాతివెల్లఁ బో
మ్మన్నదె నిన్నదాక హృదయమ్మున దీరనిబాధపెట్టి పో
కున్నద. యింతలోన మరియొక్కటి నేఁడిదిదాపురించె మా
కన్నులు కాలకుండెఁ గలికాలదురంతము చూడకుండఁగన్

141 ఉ॥

అయ్యయొ ! యాభిజాత్య మహిమాంచితు లెందఱులేరు పెద్దలీ
నెయ్యము నూపరాదె ! తగునే ! యొకనాలవ జాతివాని ముం
జెయ్యి గ్రహించి నేడు గురుశేఖరుఁడేగుట వర్ణధర్మమే
గొయ్యయొ! నుయ్యియో! వెదకికూలదె! వీరిటుసాహసించినన్

142 ఉ॥

ఆర్యులు చూచి రోమనుదురయ్యయొ ! నేడిటువర్ణధర్మసాం
కర్య మొనర్చి లోకులకుఁగాని పథంబునుజూపుచుండె నా
చార్యుఁడటంచు నంతట ప్రచారముసేయరె ! పెద్దవారలే
చర్యలొనర్తురో యదియెసాకుగ పిన్నలు సేయకుందురే !

143 ఉ॥

భాగవతాపచార మనవద్దనువారు, విశేషశాస్త్రముల్
బాగుగఁ జూడరాని మనవంటి యహంకృతి గల్గువారి కీ
త్యాగము లందరాని విషయాలనువారు, సహింపరానివీ
శ్రీగురునిందలంచు నరచేతులతోఁ జెవిఁగప్పువారలన్

144 క॥

గురుని రహస్యము లెన్నుట
పొరబాటపచారమన్న బుద్ధిని మాఱికొం
దఱుపలుక కూరకుండిరి
పరిపరి విధములుగఁ బ్రజలు పలుకుచునుండన్

145 ఉ॥

కోమలమైన కేల గురుకుంజరుఁడాతని గేలుఁబట్టి నె
మ్మోమున మందహాసమును పున్నమి వెన్నెల గాయుచుండఁజిం
తామణినా నలభ్యమగు దర్శనమిచ్చుచు జీవకోటి కా
స్వాముల గోష్ఠితో మఠపుసన్నిధి కేగుచునుండె నంతటన్

145 క॥

జెదరుచు, సిగ్గునుజూపుచు
హృదయమ్మున బాధపడుచు నేమోయనఁ గ్రీఁ
బెదవిని గదలించుచుఁ దా
సదమదమగుచుండె యోగిచంద్రుని జేతన్

147 ఉ॥

చేవిడిపించు శక్తియును జిత్తము దేవర ! పోయివత్తునన్
దీవెనలిచ్చి పంపుడని ధీరతసూపెడు మాటలేక యీ
పోవుట యేటికో ! యెటకుఁబోవుటో ! యెప్పుడనుజ్ఞ నిచ్చునో
హా ! విధి మాయ యేమగునో యన్న విచారము గోచరింపఁగన్

148 సీ॥

సంయమీంద్రుని నిల్పిస్వామీ ! యిదేమని
పలుకనుంకించి తప్పని తలంచి
అడుగులో నడుగు వేయక యూరకొనఁబోయి
సైరింపరాని దోసముగ నెంచి
ప్రేయసీ ప్రార్థన వినిపింపఁ దరిసేరి
పరువుకాదన్న భావమునడంచి
నను వీడుడిది మీకు న్యాయమే తాకుట
ననఁబోయి నాల్క జయ్యనగుదించి

ప్రణయినీ ప్రేమ మొకవంక పరువులెత్త
గురుని సంబంధమొకవంక గోడుపెట్ట
మనసు సతిచెంత, మేనులక్ష్మణుని జెంత
గలిగి భావానుభూతి సంగతుల నలిగె

149 ఉ॥

వాని మనస్సులో గలుగుబాధను జూచి పరేంగితజ్ఞుడౌ
గాన యతీశ్వరుండతని గన్గొని చెంతకుఁజేరి కౌఁగిలిఁ
బూని, శిరంబు మూర్కొనుచు ముద్దులుగుల్కు కపోలమెత్తి హే
మానయనావనాంబుధిని మగ్నమతిఁ దరిఁజేర్ప నిట్లనున్

150 ఆ॥ వె॥

ఎంత ప్రణయమున్న నీలాటిపని నీవు
సేయఁదగునె ! తండ్రి ! సెప్పుమయ్య
పైఁడి ముత్తెమంటు బంగారుచేతితో
యతుల పాదధూళి నందుకొనెదె ?

151 క॥

పాపము మొత్తనివాడవు
చూపుననే వాడిపోవు సుకుమారుఁడ వెం
తో పరితాపముఁ బడితని
నీ పైనాకేదొ జాలినిలచెను దండ్రీ !

152 తే॥ గీ॥

మంచిదగుగాక నిన్ను వేధించుచున్న
విషయవాంఛాగ్రహావేశ పీడలుడిపి
కొంత విశ్రాంతి నీకుఁజేకూర్పఁగలదు
రమ్ము మామతమదిగో మార్గమునఁగలదు

153 ఉ॥

కాని కుమార ! లోకమునఁ గామముకన్నను శత్రులెయ్యెడన్
గానగరాదు సంగమునఁ గామము కల్గును దానరోషమున్
బూనును పైన, మోహమును బుద్ధివినాశము దానిమీఁద న
ద్దాన వినాశమే తుదకు దాపురమౌసుమి జంతుకోటికిన్

154 చ॥

విషయములందు వాంఛ విడిపింపుము తండ్రి ! తదేకభావనా
కృషి జరిపింతువేని విషమించు, రజోగుణ వృక్షశాఖకున్
విషఫలమంచుఁ గామమును బెద్దలుదాకరు దానిసారమున్
భవకమునందు నింపితివి జాల్ముఁడ ! యెంతటి వెఱ్ఱివాడవో !

155 ఉ॥

త్రాగకు మోహమద్యమును. దాహముతీరదు, బుద్ధివేరుగా
లాగును జిత్తమంతయుఁ గలంచును, శాంతికి దూరమౌదు వీ
భోగము లల్పకాలఫలముల్ సుఖమన్నది శూన్యమాధులే
రాగల లాభముల్ పనికిరావివి జీవితనాశహేతువుల్

156 ఉ॥

మొన్నటిదాక నీలతిక పూవులుపూచి, మరందమూని, లో
కోన్నతగంధమిచ్చి నడియున్నది నేడిటువాడిపోయి యే
మున్నది నాయనా! హృదయముండియు లోకమెఱుంగఁజాలవిం
దున్నరహస్య మేమిబ్రతుకోయి తలంచిన గుండెనీరగుఁ

157 ఉ॥

ఎట్టిని మాంసపిండ మగుపించిన గామినియంచు వెట్టిగా
నట్టినుజాపి గన్గొనెద వందలి రూపము పాయసంబుగా
జుట్టి నుపక్రమింతు విదె చోద్యము మాంసమునింపినట్టి తోల్
తొట్టిగఁజూడఁజాలవు గదోయి నిజంబున కంతియేగదా !

155 ఉ॥

తొమ్మిది రంధ్రముల్ గలుగుతోలిది, దీనిని బంచభూతముల్
నెమ్మది నొక్కచోఁగలిపి నేర్పున నీకనుముక్కులుంచి యీ
బొమ్మను సృష్టిసేసినవి మోహముశోఁ గనలేముకాని త
త్వమ్మును, ప్రాణవాయువలు దాటిన నాడిది చూడశక్యమే

159 ఉ॥

నీప్రియురాలి నేత్రములు నీరజపత్రములైన నౌనుగా
క ప్రియమేమిగాని మనకయ్యెయొ ! నాయన ! లేతనైన సూ
ర్య ప్రభకడ్డుపెట్టె ప్రియురాలిని దాతువుగానియాజరా
వి ప్రియ మె ట్లుమాన్పదవు వెట్టివి నీజతనంబుమానుమా

160 తే॥ గీ॥

బాల్య యౌవన కౌమార వార్ధకములు
కదలకుండఁగ నెవఁడాపగలఁడు చెపుమ
నిమిషమున్నది వేరొకనిమిషమందు
మారుచుండుట ప్రకృతి ధర్మము కుమార !

161 తే॥ గీ॥

మృత్యు వేటికి ? వార్ధక మేల ! గాని
వ్యాధి చాలదె కనురెప్పపాటులోన
మంచిరూపము రోఁతగా మార్పు సేయ
ప్రకృతి సౌందర్య మేమిశాశ్వతము తండ్రి !

162 ఉ॥

నిత్యముగాద యీతను వనిత్యము రూపము వెంటనీడగా
మృత్యువునిల్చి నేక్షణముమ్రింగునో! యెవ్వఁడెఱుంగఁజాలఁడ
ప్రత్య పదార్థమంతయును దప్పరివారమె కాన దీనిలో
సత్యము నీకు దెల్పుటకు జాలినహించితి రమ్ము నాయనా !

163 చ॥

అనియొక శిష్యుఁబిల్చి ప్రియమారఁగ వీనికి స్నానపాన భో
జన విధులెల్ల జూడుమని స్వామి నిదేశమొసంగి లోనికిన్
జనినఁ గుమారుఁడంత నతిసల్పుచుఁ గన్నుల నీరునిండఁగా
ననఘ చరిత్రులార ! మరియాదయె నన్నిటు లేడుపించుటల్

164 ఉ॥

నాసతి దేశికేంద్ర చరణంబులధూళి ఏనంత చెంగులోఁ
దీసుకరండటంచు నతిదీనత వేడిన వల్లెయంచునే
దోసిలియొగ్గి నిల్వ ననుదోడ్కొని వెంబడి మీమహాత్ముఁడీ
మోసముచేసినాడు పరిపూర్ణదయాస్పదులార ! వింటిరే !

165 ఉ॥

ప్రాణసమానమైన ప్రియురాలి కనుంగనఁజూడకున్న నా
మానస మగ్నిలోఁ బొరలు మాదిరినుండు వియోగముల్ క్షణం
బైన భరింపఁజాలఁ దడవైనది నేనికఁబోయివత్తు మీ
యానతి దాటినాడనని యాగ్రహమూనకుడంచు వేడినన్

166 చ॥

చిఱునగవంకురింప నొకశిష్యుఁడు వానిని జేరదీసి యిం
కురక యదేవిచారముఁగనుండకు మింతట దించివేయుమా
భరమును మూడునాళ్ల మురిపంబున కింత విషాదమేల ? నీ
చరితము ముందు దివ్యమగు సత్కృతి కాగలదోయినాయనా !

167 ఉ॥

భాగ్యమటన్న నీయదియె భాగ్యమురా మనదేశికుండు నీ
యోగ్యతకెంతయో కుతుక మొందెను యీకనుపించువారిలో
మృగ్యుఁడు నిన్ను మించగలమేటి నిజంబుగ ముందుముందు స
ద్వ్యాగ్యుతమైన పద్ధతికి వచ్చెదు నాపలుకాదరింపుమా

168 చ॥

ఎముకల గూడుకోసమయి యెఱ్ఱని మాంసముకోసమై మదిం
గుములుచునుంటివయ్యొ ! భవకూపమునంగల నిన్నుజూచి తా
నమిత దయాస్వభావమున నావలికీడ్వఁగ దేశికుండు మో
దమును వహింపకుండఁ పరితాపము బూనెదవేల జాల్ముడా !

169 మ॥

అనిమిత్తంబుగ స్వామి నిం వలచి నీహస్తమ్ముజేఁబూని పా
వనవీక్షామృత వాహినీర్ఝరుల నీపంకంబు క్షాళించినా
డనఘా ! యెంతమహానుభావుఁడవు నీయందింత యాకస్మిక
ప్రణయంబెట్లు వహించెనో గురువు నీ భాగ్యంబుసామాన్యమే

170 ఉ॥

నీమనమందు నున్నదొక నిర్మలమైన నిసర్గమైన స
త్ప్రేమ సుధాప్రవాహ మది ప్రేయసిపైఁ బ్రవహించుచుండఁగా
స్వామి కటాక్షముంచి భగవంతునియందిది ద్రిప్పఁజూచి నా
డేమి విచిత్రమయ్య తరియించితి వెంతయదృష్టశాలివో !

171 ఉ॥

ప్రేయసి కన్నులంచు రవివేడిమినూపఁగ వాడి వత్తులై
పోయుగమిాగునంచు మదిక్షోభిలుచుంటివి పాపమెంతయో
నాయన ! ముందునీదు నయనమ్ములకున్న రజంబు మాన్పఁగాఁ
జేయుము వెఱ్ఱిమోహమును జెంది వివేకము జారనీకుమా

172 ఉ॥

ప్రేయసి కన్నులంచుఁ బలవించెద వింతకుమించు లోచనా
లీయెడఁజూడఁగా గలవొకించుక యోపికపట్టియుండు మో
నాయన ! దేశికుండు కరుణాపరతంత్రుఁడు నీకుమంచి తా
నీయఁగలాడు ప్రాకృతదుకీహాలు నీమది నుంచఁబోకుమా

173 ఉ॥

పాడు సుఖాభిలాషలకు బాధనహింపకు - సంయమీంద్రుఁ డీ
నాడు కృపాంతరంగుఁ డయినాఁడిఁక నింతటితోడ నీమనః
పీడ తొలంగునంచు వినిపించినసాతఁడు వెచ్చనూర్చి యే
మాడఁగ శక్తిలేక నసహాయపరిస్థితి నిల్చియుండఁగన్

174 సీ॥

కస్తూరితిలకమ్ము గడిగించి మోమున
విమలోర్ధ్వ పుండ్రంబుఁ బెట్టినాఁడు
తీయని హారాలు తీయించి గళసీమఁ
దులసిమాలికలను నిలిపినాఁడు
వెలగల్గు వస్త్రముల్ విడిపించి యుతికిన
పట్టంచు పంచెలు కట్టినాఁడు
ముంగురుల్ సవరించి ముడివేయననువుగా
నీటైన జుట్టు బంధించినాఁడు

సతిని మరపింపనేమేమొ సలిపినాఁడు
దొర్లుకన్నీరు చేతితోఁ దుడిచినాఁడు
పాప మాజన్మభోగి సర్వస్వమెల్లఁ
జూచుచుండఁగఁ క్షణములో దోచినాఁడు

ఇది

# ధనుర్దాసుఁడు
## తృతీయసర్గ

175 తే॥ గీ॥

సరసిలో, నీవు విహరించు సమయమందు
గమలములనున్న రజము నీకంటఁ బడుట
దృష్టిచెడెనేమో ! నినుఁబట్టి దెచ్చినాడు
రాజహంసమ ! నేడు మార్గస్థుఁడొకఁడు

శ్రీమతే రామానుజాయ నమః

# ధనుర్దాసుఁడు

## చతుర్థసర్గ



176 సీ॥

ఉభయాగమాంతంబు లురుమనీష గ్రహించి
పఠన పాఠననిష్ఠఁ బరగువారు
ఆచార్యుఁడే మన హరియంచు మదినమ్మి
చరమ పర్వప్రీతిఁ జాలువారు
అంతరింద్రియ నిగ్రహంబుతో బహిరింద్రి
యంబుల నరిగట్ట నరయువారు
పరసమృద్ధికి మెచ్చి పరదుఃఖ దుఃఖిత్వ
మను గుణంబును గల్గినట్టివారు

ప్రాయమందున్నవారు – విద్వాంసులైన
వారు – లక్ష్మీకటాక్షాప్తిఁ బరగువారు
స్వామి రామానుజయతీంద్ర చరణనళిన
సేవసేయఁగ శిష్యులై చేరినారు

177 క॥

ఆగర్భ శ్రీమంతులు
భోగంబులు వదలి కట్టు పుట్టమ్ములతో
శ్రీగురుపద సేవకుగా
సాగిరి యందేమి సౌఖ్యసంపద కలదో

178 ఉ॥

భోగములన్నియున్ వదలి పుట్టిన గ్రామమువీడి సర్వమున్
ద్యాగమొనర్చి బంధువులయందు విరక్తినిబూని సర్వదా
యోగివరేణ్య పాదయుగ మొక్కటియే శరణంబటంచు లోఁ
బాగుగఁ బాఱఁజూచుకొని వచ్చిరి కొందఱు స్వామిశిష్యులై

179 ఉ॥

ఐహికవాంఛలన్ విడిచినట్టియుదారులు, పంచసంస్క్రియా
బాహిర చిహ్నముల్ గల ప్రపన్నులు - సాత్వికులైనవారు దా
సోఽహమటంచుఁ బల్కు విమలాత్ములు స్వామికి దాసభూతులై
శ్రీహరి దత్త్వవైభవముఁ జెప్పఁగఁబోదురు దేశమంతటన్

180 సీ॥

ఆ శ్రియఃపతియందు నాత్మార్పణముఁ జేసి
నిర్భరత్వముఁబూని నిలచువారు
కర్మానుగుణముగా గడచు నైహికయాత్ర
యనుచు నుపేక్షగ నుండునట్టి వారు
భగవదాచార్యాది భవ్యకైంకర్యమే
ప్రాప్యమంచు నపేక్షఁబరగువారు
ద్వయమంత్రవిలస దర్థానుసంధానంబె
కాలయాపనమంచుఁ గ్రాలువారు

జ్ఞానసంపదతో - ననుష్ఠాన వృద్ధి
గల యొక ప్రపన్ను నభిమానకళకుఁ బాత్రు
లగుటయేగొప్ప పరమార్థమనుచుఁ దలఁచి
శిష్యులై స్వామిసన్నిధిఁ జేరినారు

181 సీ॥

సతి పునస్సంధాన సమయాన యతిరాజు
వలెనుండ విడనాడి వచ్చెనొకఁడు
పెండ్లిపీటలముందు ప్రేయసిన్ విడనాడి
సన్యసించిన మహాజ్ఞాని యొకఁడు
ఒకనాడు గురువుగా నున్న తాసనమెక్కి
చేరిశిష్యుండైన ధీరుఁడొకఁడు
బహుశాస్త్రచర్చలోఁ బరిభవమ్మును జెంది
దాసోహమన్న విద్వాంసుఁడొకఁడు
మంచిని దలంచి - పాండిత్య మదమణంచి,
శమదమాదులు బెంచి, వాసనలతోడ
మమ్యమునుద్రెంచి, యతిరాజు మహిమగాంచి
స్వామి రామానుజార్య సంబంధులైరి

182 చ॥

పరిసరమందునున్న ప్రతిపట్టనమున్ బ్రతిపల్లెకేగి, దు
ర్భర విషయాభిలాషలకు బాధపడించెడు బద్ధజీవులన్
గర మనురక్తిఁజేరి మతగౌరవమేర్పడ "నర్థపంచకం"
బరయఁగఁజేతు రెంతటి దయామతులో గురుశిష్యచంద్రములల్

183 ఉ॥

శ్రీహరి స్థూలసూక్ష్మ చిదచిత్తులచేత విశిష్టుడైన వా
డైహికమందు - వాడు శరణాగతిలభ్యుఁడు తత్త్వమిద్ది సం
దేహము లేదు సాత్వికులు దీని నెఱింగి తరించుడంచుఁ దా
మీ హితముల్ వచింపఁ జరియించుచునుందురు దేశమంతటన్

184 ఉ॥

తాపము, పుండ్రముల్, మనువు, దాస్యము, యాగము పంచదీక్షలే
శ్రీపతి వారిదాసులకుఁ జిహ్నములంచు, మతప్రభావముల్
వ్యాపృతిఁ జేయుచుందు రిటువంటి మహాత్ములు శిష్యులౌటచే
లోపము లేకయుండె యతిలోకశిఖామణి కన్నిరీతులన్

185 చ॥

క్రతువులు సేయఁబూనుటయొ ! గ్రామములందు విశిష్టమైనదీ
మతమని బోధసేయుటో! మమత్వము ద్రుంచుటొ, ధూపదీపముల్
గతి చెడియున్నకోవెలలు క్రమ్మర బాగొనరించుటో ! యిదే
యతనము మీఁదనుందు రనయంబు యతీంద్రుని శిష్యచంద్రముల్

186 చ॥

మతసభలంచుఁ బెట్టి ప్రతిమానవుఁడున్ బరమార్థమేదియో
యతిసులభమ్ముగా నెఱుఁగునట్లు ప్రచారము సేయుచుందు రీ
యతికుల చక్రవర్తి చరణాంబుజశిష్యులు వచ్చుజన్మకీ
యతుల తపోనిధాను లెవరౌదురొ ! యెంతటికీర్తిగాంతురో !

187 ఉ॥

దేవుని కన్నముందు గతి దేశికుఁడంచుఁ దదీయదేహమే
దేవళమంచుఁ దచ్చరణతీర్థమె, తారకమంచు నెంచి సం
భావన సేయుచుందురొక భాగవతోత్తము నాశ్రయించు లే
జీవిత భాగధేయమని చెప్పఁగఁబోదురిదే రహస్యమో !

183 ఉ॥

పండితులైన వారెదురు వచ్చినవారికి నంతదూరమే
దండములట్లు భూమిఁబడి దాసులమంచు నమస్కరింతురా
ఖండలుఁ డీయఁవచ్చినను గౌరవమీయరు, వారిలోనెదో
నిండిన తృప్తియున్నది తృశీకృత సర్వవిభూతు లాటకున్

189 శా॥

అర్చామూర్తిని రాయిగాఁదలఁపఁ బోదాచార్యునిన్ మర్త్యుగాఁ
జర్చల్ సేయరు, వైష్ణవుండయిన చోఁ జాలున్ గులద్వేషమున్
గార్చిచ్చున్ శమియింపఁజేయుదురు మన్త్రిమొక్క శబ్దమ్ముగా
మార్చన్ జూడరు సర్వతత్త్వవిదు లీమాన్యుల్ మహైకాంతికుల్

190 ఉ॥

కామిని మాతృమూర్తియని గౌరవమిత్తురు, కాంచనంబు మా
స్వామికిఁ గింకరత్వనిధి కావలెనంచుఁ బరిగ్రహింతు రా
ధీ మహనీయులైన గురుదేవుని శిష్యులు వారిదృష్టిలో
గామిని కాంచనమ్ములకుఁ గల్గెమహోన్నతి యెంతధన్యులో

191 ఉ॥

ఇట్టి మహానుభావులు, యతీంద్రుని శిష్యులు వీరిగోష్ఠిలో
నెట్టిటొ చిక్కినాడు మన హేమమృగం డిటులుండు నంతలో
గొట్టిరి రెండుజాములకు గోవెలగంట నివేదనార్థమై
పట్టి త్రిదండమంత మునివచ్చె కుటీరమునుండి వీధికిన్

192 ఉ॥

స్వామినిజూచి శిష్యులిరువంకల గోష్ఠిగనిల్వ దీనుఁడై
హేమమృగండు మాత్రచుట నింత మొగమ్మున నిల్చియుండఁగాఁ
బ్రేముడిమీర దగ్గరకుబిల్చి యతీంద్రుడు భాష్యకల్పనా
శ్రీమహనీయమైన కుడిచేత శిరంబును దువ్వి యిట్లనున్

193 ఉ॥

పాపము నానిమిత్తమున బాధవహించితి వింతదాఁక నీ
శాప మొసంగినాడనని స్వాంతమునందున దంద్రడినాపయిన్
గోపము నీకు వచ్చెననుకొందును కాని సమస్తభూతముల్
తాపములందకుండఁ బ్రబవదమ్ములుగూర్చెమాప్రయత్నముల్

194 ఉ॥

కాని, కుమార ! ప్రేయసినిగాని, సుతాదులగాని, దేహమున్
గాని, ధనమ్ముగాని, మమకారముగాని, సుఖానుభూతులన్
గాని, త్యజించి నావలెన గట్టుడు మీరును గావిగుడ్డలం
చేను వచింప నంతరసహీనములే యతి సంప్రదాయముల్

195 ఉ॥

మా ప్రణయంబునందు నణుమాత్రము స్వార్థము లేదు, సర్వభూ
త ప్రియమైన తత్త్వమును దాచక చాటుట కేగ దయ్య దీ
తా ప్రతిపత్తినందితిమి సార్వజనీనకమైన ప్రేమతో
విప్రతిపత్తి లేక కనిపింతురు వైష్ణవులైన సాధువుల్

196 ఉ॥

ప్రాకృతవస్తువుల్ పనికివచ్చును గాని పదార్థమంతయున్
లోకహితార్థమై కమలలోచనుఁ డీయఁగ స్వార్థదృష్టితో
నాకొఱకంచు వాడుకొన నాయన! దోసముగాదె! త్యాగివై
సాకదు వేని లోకులను జాలు నదే పరమార్థసేవరా

197 ఉ॥

నాయిలు, నాతనూభవులు, నాసిరి, నాసతి, నాహితాదులున్,
నాయది నాదినాదియని నాయనుభావమె నాశహేతు వో
నాయన! చావు పుట్టుకల నాడుకనంబడ కిప్పుడెట్లు నీ
వాయెనొ! పాఱఁజూడు మిదియంతయుఁ బెన్గలచే నిఱుంగుమా

198 ఉ॥

నీసతి కింతయందముగ నేత్రములెవ్వఁ డొసంగినాడు, నీ
కీ సిరి నెవ్వఁడిచ్చె? నిను సృష్టిని జేసిన వాడెవండు? నీ
కీ సుకుమార దేహ మెవడిచ్చెను గొంచెము చూచుకొమ్ము, స
న్న్యాసి నత్యాసమాడుదునె? నాయన! సర్వము వాడొసంగెరా!

199 ఉ॥

ఆయన వస్తువాయనకు నర్పణసేసి తరించుటొక్కటే
న్యాయముగాని నాదియని నాయన ! వాడుకొనంగరాదు నా
రాయణుఁడొక్కఁడే మనకు నైహికమందుఁ బరమ్మునందు సా
హాయక మున్నవాఁడు పరమార్థమిదేయని నమ్మియుండుమా

200 ఉ॥

ప్రాఁతుమునందు నీకు గనవచ్చెడు దృశ్యములెల్ల బుద్బుద
ప్రాయములల్పముల్ మెఱపునంటివి మీసలమీఁదిఁ దేనియల్
నాయన ! వీనిఁగూర్చి యొకనాటికి నీమదిఁజింతపెట్ట కీ
సాయము నీకుఁ జేయుటకె చాలశ్రమంబిడి తోడితెచ్చితిన్

201 ఉ॥

రమ్మొకసారి పోవుదము రంగనికోవెల కందు శేషత
ల్పమ్మున నున్నవాఁడు – రఘువంశము బాలిటి భాగధేయ మం
దమ్మున గోటిమన్మథులధాటి విరాజిలుచుండె వాని నే
త్రమ్ములు పుండరీకములురా ! నిగమాంతము సాక్ష్యమిచ్చెరా

202 కం॥

గంభీరాంభస్సంభవ
శుంభత్పరి మృష్టనాళ సూర్యకర శ్రీ
జృంభిత రక్తాంభోరుహ
దంభంబడగించు రంగధాముని గన్నుల్

203 ఉ॥

వానికి నెజ్జితామరలవంటి విశాలములైన నేత్రముల్
గానగవచ్చుచున్నయవి కాంచుము, నీప్రియురాలి కన్నులన్
వీనిని మించునట్లు కనిపించునొ ! యోమొకుమార ! యెందఱో
జ్ఞానులె వీనిదృష్టివిడనాడక కాపురముండిరియ్యెడిన్

204 ఉ॥

నీకు మనోహరంబులగు నేత్రములేగద తండ్రి ! కావలెన్
జీకిఁక నెంతమాత్రమును జెందకు మీా విషయంబునందున
ప్రాకృత శోభవెల్లు భగవంతుని జక్కని కన్నులేడ ? నీ
ప్రాకృత వస్తువైన ప్రియురాలి కనుంగవయేడ ! చూడుమా !

205 ఉ॥

ఈవిషయమ్మునందు మునుపెన్నడొకాని వివాదమయ్యె, దు
ర్భావనతో నొకండు భగవంతునిదృష్టికి నీచసామ్యమున్
భావనసేయఁ గాదనుచు భాష్యమునందున వ్రాసినాడ మా
దేవుని నేత్రవైభవము దివ్యమురా ! యొకసారిజూడరా

206 చ॥

అనుచు యతీశ్వరుండు ప్రియమారఁగఁ బల్కుచువచ్చుచుండఁగా
గనఁబడె రంగనాయకుని గర్భగృహంబట పుండరీకలో
చనుఁడు భుజంగతల్పమున జల్లనిసేవయొసంగఁ జెంగటన్
జనతతినిల్చి హేమ గుఱుచుంద్రునిజూచి నమస్కరించుచున్

207 ఉ॥

చూడుము స్వామినేత్రముల సోయగమంచు గురుండు తీర్థముల్
మూడునజల్లి కన్నులను మార్జనసేయఁగ నింతకాలమున్
గూడెముఁగట్టి దృష్టిచెడఁగొట్టిన మోహరజంబడంగి తా
రాడె నెదో యపూర్వమగు నద్భుత తేజము వానికంటికిన్

208 ఉ॥

చీకటినుండి వెల్గునకుఁ జేరినమాడ్కి ననాదికాల మా
యాకులమైన బద్ధతతికాత్మ వికాసముకల్గినట్లుగా
ప్రాకృతమైన భోగతతిపైఁగల మోహముచేఁ దపించు నా
లోకమఃనుండి వీనికవలోకము క్రొత్తదివచ్చె వింతగన్

209 కం॥

ఇటు ప్రేయసి నేత్రమ్ములు
నటువైపున స్వామికనులు నటునిటుచూచెన్
గటకటబడె మనమందున
బొటపొట నశ్రువులురాల మునిఁగని మ్రొక్కెన్

210 చ॥

విజయము కల్గెనిప్పటికి పిమ్మట హేమయు చాపదాసుఁడున్
భుజములఁ దప్తముద్రికలఁబూని యతీంద్రుని ముఖ్యశిష్యులై
ప్రజలకు దేశమంతటను వైష్ణవసంస్కృతిఁ జాటసాగిరీ
నిజమొక కావ్యమయ్యె రమణీయముగా ముదమందనందఱున్

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు
సర్వం శ్రీహయగ్రీవార్పణమస్తు

ఇది

# ధనుర్దాసుఁడు

## చతుర్థసర్గ

# సాంకేతిక పద వివరణము.



నోట్సు:- 1 వ పేజీ 1 వ పద్యములో - శ్రీ శృంగేరీ శారదాపీఠములో శ్రీ భగవద్రామానుజులు శ్రీభాష్యమును రచించి, వినిపించి నప్పుడు భారతీదేవి ప్రత్యక్షమై "శ్రీభాష్యకార" యని బిరుదమొసంగెను. నిత్య లీలావిభూతులనగా - నిత్య విభూతి పరమపదము - లీలావిభూతి యీ లోకము - ఈ రెండు లోకములకు నీడ రక్షకము శ్రీ భగవద్రామానుజులె -

„ 1 వ పేజీ 2 వ పద్యములో - "శంజమాంబ" పూర్వాశ్రమములో శ్రీ రామానుజులవారి కులపతి గురునకిచ్చిన శపథము కూలద్రోసి గోపురమెక్కి మంత్రార్థమును వెదజల్లెను - తిరునారాయణపురమందు కడజాతివారు మూడు దినము లాలయములో ప్రవేశించుటకంగీకరించెను - ఢిల్లీ పాదుషా కుమార్తెను శ్రీ యదుగిరి సంపత్కుమారునకు పెండ్లిగావించి హిందూ మహమ్మదీయ సఖ్యముపాటించెను - బ్రహ్మసూత్రములను బహుధా శోధించి చిదచిదీశ్వరతత్త్వమే సిద్ధాంతమని స్థిరీకరించెను -

„ 2 వ పేజీ 3 వ పద్యములో - శరణాగతి - అనగా శ్రీ భగవద్రామానుజులు గద్యత్రయము రచించిరి. అందులో శరణాగతి గద్యముముముక్షువులకు ముంగొంగు పసిండి -

„ 5 వ పేజీ 15 వ పద్యములో - శ్రీ వైష్ణవ సంప్రదాయ సిద్ధముగాఁ గొన్నిమాటలు దాక్షిణాత్య మర్యాదననుసరించి ప్రయోగింపబడినవి. దాసోఽహమనగా నమస్కారమను నర్థమున ప్రయోగింపబడినది. శ్రీ యమునాంగుళిత్రయముద్ర యనగా

శ్రీ యమునాచార్యులవారు శ్రీ భగవద్రామానుజాచార్యుల వారి ఏకలవ్య స్థానీయులుగానుంచుకొన్న పరమాచార్యులు మూడు తిరుమాళిగలు అనగా ఇళ్లు. అడియేననగా - దాసు డని యర్థము. ఈ రెండుపదములు ద్రవిడదేశీయములు -

నోట్సు:- 6 వ పేజీ 17 వ పద్యములో - శ్రీ భగవద్రామానుజులకు - లక్ష్మణాచార్యులనియు, భాష్యకారులనియు, ఉడైయ వరులను ( ద్రవిడదేశీయ సంప్రదాయసిద్ధమను పేరుతోను వ్యవహరింతురు )-

„ 7 వ పేజీ 22 వ పద్యములో - శ్రీ యామునాచార్యులవారు చరమదశలోనుండగా వారిని సేవించుటకుగా శ్రీ రామాను జులవారు హుటాహుటి కాంచీపురినుండి శ్రీరంగం విచ్చేసిరి కాని కావేరికి చేరుకొనునంతలో పరమాచార్యులు పరమ పదించిరి. ఇదిశ్రీరంగనాథుడు చేసినపనియని చాలాకాలము శ్రీ రామానుజులు శ్రీరంగమునకు వేంచేయలేదు. ఇందులకు కారణము శ్రీరంగనాథుని రాక్షస సహవాసదోషమని శ్రీలు ఎత్తిపొడిచిరి. రాక్షససహవాసమనగా శ్రీరంగ నాథుని కావేరిదరి ప్రతిష్ఠించినది విభీషణుడు. అందువల్ల విభీషణుడు రాక్షసచేష్టితమును రంగనికిచ్చి తాను మంచి వాడాయెను-

„ 8 వ పేజీ 25 వ పద్యములో - శ్రీ రామానుజు లీలోకమం దున్నంతవరకు మోక్షమిచ్చు నధికారముద్ర వీనియందే యున్నది. రామానుజులను కాదని రంగడెవ్వరికి మోక్ష మీయజాలడని ప్రజలు రంగనివిడచి రామానుజుల నాశ్ర యించిరి -

నోట్సు:- 9 వ పేజీ 27 వ పద్యములో సంసారములో శ్రీ రామానుజులకు భార్యయగు తంజమ్మకు మూడుచోట్ల మనసుకలియక విడిపోయెను. ఒకనాడు విద్యార్థి కన్నము పెట్టుమనగా లేదని బొంకెను. మరియొకనాడు గురుభార్యను నిష్కారణముగా నిందించెను. కాంచీపూర్ణులు సాపడగా మిగిలిన యన్నముచ్ఛిష్టమని పారవైచెను. ఇవి శ్రీ రామానుజులకు మహాబాధాకరములై తుదకు ఆశ్రమస్వీకారమునకు హేతువులయ్యెను. కాని ఇదియొకవిధముగ మంచిదనికాబోలు కవి సకలసంసారితతికి దంజముగనున్న తంజమాంబయని నిరూపించెను. తంజమనగా ద్రవిడములో రక్షకమని యర్థము. భర్తకీవిధముగా విరక్తిని గలిగించి తంజమ్మ నిజముగా మనకు తంజమైనదని భావము -

,, 11 వ పేజీ 34 వ పద్యములో - తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము, ఇవి పంచ సంస్కారములు. ఆచార్యుడు శిష్యునకు సుదర్శన పాంచజన్యములు తప్తముచేసి భుజమూలముల నుంచును. పిదప మోమున ఊర్ధ్వపుండ్ర ముంచును. ఆపిదప లోగడ వ్యవహార నామముగాక క్రొత్తగా దాసనామముంచును. అటు పిమ్మట చెవిలో తిరుమంత్రముపదేశించును. ఆపైన తిరువారాధన కనుజ్ఞ యిచ్చును. ఇదియె పంచసంస్కారదీక్ష -

,, 11 వ పేజీ 36 వ పద్యములో - తిరుమంత్ర, ద్వయ, చరమములనగా ఆచార్యుడు శిష్యునకు మూడు మంత్రము లుపదేశముచేయును. అందులో మొదటి మంత్రము తిరుమంత్రము, రెండవది ద్వయమంత్రము, మూడవది చరమశ్లోకము -

నోట్సు:- 11 వ పేజీ 37 వ పద్యములో - అష్టాక్షరమనగా ఎనిమిదక్షరములు గల తిరుమంత్రము. మంత్రరత్నమనగా ద్వయమంత్రము. చరమార్థమనగా మూడవమంత్రము. ఆచార్యనిష్ఠియే అంతిమోపాయము -

,, 38 వ పేజీ 110 వ పద్యములో - జ్ఞానీత్వాత్మైవమేమతం- గీత -

,, 59 వ పేజీ 181 వ పద్యములో -

1. "గోవిందభట్టరు" శ్రీ రామానుజులకు చినతల్లి కుమారుడు
2. "కూరేశులు" శ్రీ రామానుజులవారికి ప్రథమ శిష్యుడు
3. "యాదవప్రకాశులు" శ్రీ రామానుజులవారికి తొలుత వేదాంత గురువు -
4. "యజ్ఞమూర్తి" శ్రీరామానుజులవారితో పెక్కుదినములు శాస్త్రవాదముచేసిన విద్వాంసులు -

,, 69 వ పేజీ 201 వ పద్యములో - "యథాకప్యాసం పుండరీకమేవ అక్షిణి" అని ఛాందోగ్యములోఁ గలదు -



# శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యస్వామివారి రచనలు

| | | | |
|---|---|---|---|
| 1 | శరద్రాత్రి | ... | 1- 0-0 |
| 2 | మాండవి | ... | 0-10-0 |
| 3 | శబరి | ... | 0-12-0 |
| 4 | ఋష్యమూకము | ... | 0-12-0 |
| 5 | ధనుర్దాసుఁడు | ... | 1- 0-0 |
| 6 | పండితగోష్ఠి | ... | 1- 0-0 |
| 7 | గీతాసందేశము | ... | 0- 8-0 |
| 8 | మురళీధరవిలాసము | ... | 1- 0-0 |
| 9 | విద్యావిలాసము | ... | 1- 0-0 |
| 10 | యతిరాజవిజయము | ... | 0- 4-0 |
| 11 | కవితావిహారము | ... | 0- 4-0 |
| 12 | ద్వయమంత్రార్థము | ... | 0- 4-0 |
| 13 | చరమార్థదీపిక | ... | 0- 4-0 |
| 14 | శ్రీకాళహస్త్రీశ శతకము | | 0- 4-0 |
| 15 | మధురసూక్తి | ... | 0- 4-0 |
| 16 | మంగళాశాసన వైభవము | | 0- 8-0 |
| 17 | శ్రీ జియ్యరస్వామివారి అష్టోత్తరశతం సరము (అచ్చులోనున్నది) | | 0- 2-0 |

వలయువారు :

శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యులు

ముక్తిపల్లి అగ్రహారము

రేపల్లె తాలూకా : : గుంటూరు జిల్లా